REG. NO. M. 1885

సంవత్సర చందా 3—0—0

# శ్రీ ఆంధ్రసర్వస్వము

సంపాదకుఁడు

ఏడిది వేంకటరావు

౧వ సంపుటము | రాజమహేంద్రవరము ౧౯౨౮ | ౪వ సంచిక

N B:—Original Articles On Social Political Economic Religious And Literary Topics And Fine Arts Of Andhradesa Will Be Paid

ఆంధ్రుల పూర్వాధునిక మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సారస్వత, కళాపరిస్థితులను గూర్చి పరిశ్రమచేసి వ్రాసిన స్వతంత్ర వ్యాసములు సత్కరింపఁబడును.

## స్వవిషయము

### చందాదారులకు విజ్ఞప్తి

మహాశయులారా!

ఇంతవఱకు నాలుగు సంచికలను దమకు పంపించుచున్నారము. ప్రస్తుతపరిస్థితులను బట్టి ఇంతకన్న యెక్కువగా పంపించుకొనుట కష్టమను సంగతి తామెఱుగనిది కాదు. ద్రవ్యసాహాయ్యము లేనిదే మాయుద్యమము నెరవేఱదు. కావున భాషాపోషకులగు మా చందాదారులు తమ తమ చందా సొమ్ము రు 3—0—0 మనియార్డరు ద్వారా "ఆంధ్రసర్వస్వ పత్రికాఫీసు రాజమహేంద్రవరము గోదావరిజిల్లా" అని పంపించ వేఁడెదము. పత్రికను పుచ్చుకొనను సంకల్పము లేనిచో వృథావ్యయము చేయించక వెంటనే కార్డుమీఁద సమాధానము వ్రాయించ వేఁడెదము.

## చరిత్రపరిశోధకులకు విజ్ఞప్తి

ఇంతవఱకు మాపత్రికయందు "పూసపాటి రాజుల పూర్వోత్తరము" అను స్థానికచరిత్రను ప్రకటించుచున్నారము. అది గంజాము, విశాఖపట్టణ మండలి వాసులకు చదువుటకు కుతూహలముగ నుండును. మాపత్రికను ఆంధ్రుల కందఱకును జదువుటకింపుగ నుండునటుల జేయుటయే మాయాశయము. కావున ఇంతటినుండి కృష్ణా, గుంటూరు, నెల్లూరు మండలములలోని పూర్వపు శాసనములఁ గూర్చి ప్రకటించుచున్నారము. ఈశాసన ప్రతులయందు కొన్ని వ్రాత పొరపాటులు ఉండిన నుండవచ్చును. కావున్ని ఆయాప్రాంతములందలి పరిశోధకులందఱు మూలశాసనములను తిరిగి పరిశోధించి మా ప్రకటనములకును, మూలములకును వ్యత్యాసమున్నచో నట్టి మార్పులను మాకు తెలియఁజేయ వేఁడెదము; వాని నెంతయు నాదరపూర్వకముగ స్వీకరించి మాపత్రికయందు తిరిగి ప్రకటించెదము. మాకీమాత్రము సాయముసేయ చరిత్ర పరిశోధకుల నెంతయు ప్రార్థితులము.

# ప్రార్థన

[అప్పిళ్లె చక్రవర్తుల వెంకటరంగనాథస్వామిగారు]

శా॥ శ్రీవత్సస్ఫుర దాతరాశము కృపా ♦ స్నేహాన్వితంబున్ వర
ద్వా వేదాంగకవర్తికంబు సకల ♦ ప్రజ్ఞాయుతంబున్ సదా
సేవాకర్షిత మాని మానసమహా ♦ సీమాభిరామంబునై
ఏవేళన్ ధరవెల్గుజ్యోతి యహదు ♦ శ్రేయస్థమిన్ బాపుతన్

# నాటకలక్షణములు

[ఆంధ్ర శేషగిరిరావుగారు]

(తొలినుడి)

నాట్యకళ మునీశ్వరుఁడు భరతునిచేఁ దొలుదొల్త కనుఁగొనబడెనని కొందఱిమతము. వేదముల నుండి బ్రహ్మదేవుఁడు నాట్యకళను క్రోడీకరించి భరతునకుఁ బ్రసాదించెనని పురాణజ్ఞులు కొందఱు వక్కాణించుచున్నారు. నాట్యములు మొట్టమొదట త్రివిధములు; నాట్య, నృత్య, నృత్తములని. భరతుఁడీ త్రివిధనాట్యములను గంధర్వులకు శ్రద్ధతో నేర్పెను. తాండవలాస్యము లనఁబడు మఱిరెండు నాట్యవిధములను శివుడు కనిపెట్టి నాట్యకళను పెంపొందించెను.

ఈ వివిధనాట్యకళలలో నాట్యమనునది వాక్కులతోఁగూడిన అభినయము. నృత్యము భావప్రదర్శకమగు అభినయము. నృత్తమో కేవలము అంగవిక్షేపము. తాండవలాస్యములు అంగవిక్షేపములో మఱిరెండు భేదములు. తండు అనఁబరగు తన సేవకునకు శివుఁడీ అభినయమును కఱపఁగా నయ్యది తాండవమను పేర వ్యవహరింపఁ బడియెను. లాస్యమను నాట్యము తొలుత పార్వతి ఉషాకన్యకు ఉపదేశించెను. ఉషాకన్య తన అత్తవారియూరగు ద్వారకానగరమందలి గోపికలకుఁ జెప్పెను. వారద్దానిని సురాష్ట్రదేశ స్త్రీలకు నేర్పిరి. వారినుండి నానాదేశ స్త్రీలు పొందిరి.

నాట్యకళకుఁ దొలిసారి లక్షణ మేర్పఱచి క్రమవికాసమునకు మార్గమన్వేషించిన మహనీయుఁడు భరతముని. వ్యాఖ్యాతృకర్తలు భరతసూత్రముల నెత్తి తమతము వ్యాఖ్యానములలో నుదహరించిరి. ఇట్లుదహరింపఁబడిన సూత్రదేశములే కాని తద్గ్రంథము నుపలబ్ధి నేటికిని లేదు.

అటుపిమ్మట నాటకకళను గూర్చి లక్షణ సమన్వయమొనర్చి రచింపఁబడిన గ్రంథములలో దశరూపకము మొదటిది. విఖ్యాతనృపుఁడును, ముంజ అనురాజు ఆస్థానకవియూనగు ధనంజయుఁడీ గ్రంథకారుఁడు. ఈతఁడు పదునొకండవ శతాబ్దములో నివాడు. అప్పటికి నాటకకళ ఉచ్చదశలో నున్నది. దశరూపకమునకు వ్యాఖ్యానమును ధానికుఁడనువాఁడు రచించెను. అభాష్యము వంపలి నిదర్శనములు రత్నావళినుండి కూడనున్నవి. ఇట్లగుట దశరూపకరత్నావళి నాటకకాలమునకు వైరుధ్య మేర్పడుచున్నది.

కావ్యప్రకాశములో నందందు నాట్యకళప్రస్తావనము గాంచినవి. సాహిత్యదర్పణములోని షష్ఠాధ్యాయమునందు నాటకకళా విమర్శనము కలదు. ఈగ్రంథకాలనిర్ణయమున కాధారములులేవు. కావ్యప్రకాశముకంటె నీగ్రంథము నవీనము. సంగీతరత్నా

కరము నాటకలక్షణములకంటె సంగీతశాస్త్రసాంప్రదాయములను విమర్శించును. దండి, కావ్యాదర్శనము; వామనాచార్యుని, కావ్యాలంకారవృత్తి; జయదేవకృత చంద్రాలోకమునకు విస్తృతియావదగిన అప్పయ్యదీక్షితులు, కువలయానందము; భాముని, అలంకారసర్వస్వము; జగన్నాధపండితరాయలవారి రసగంగాధరము; అలంకార కౌస్తుభము, మొదలగునవి లక్షణగ్రంథములు. ఇవి అన్నియు నాటకచరిత్రరచనకు ఆధారములు. భావోద్రేకమునుగూర్చి చర్చించు. రుద్రభట్టు శృంగారతిలకము; భానుదత్తుని రసమంజరి రసతరంగిణియును కూడ మనచేతికిఁ దోడుపడును. రసతరంగిణిలో భరతసూత్రము లుదహరింపఁబడినవి. భోజప్రబంధమును శార్ఙ్గధరపద్ధతి అనబడు ప్రాచీనసంస్కృతగ్రంథ సంకలితముల సాయమున సవిమర్శనముగ కాలనిర్ణయాది బహువిషయముల పరిశీలించి, నిర్ధారణచేసి సంస్కృతనాటకచరిత్ర రచించుచున్నారు. మద్గురువరేణ్యులగు శ్రీయుత మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతదశరూపకమును ఆంధ్రములోనికిఁ బరివర్తించి ప్రతిభాపాండిత్యములను చూపియున్నారు. ఆయాంధ్ర దశరూపకము నాకమిత సాయ మొనర్చినది. కావున శ్రీవారికి నా నమస్కారశతములు.

---

# ప్రశ్నోపనిషత్తు

[చిలుకూరి నారాయణరావుపంతులు గారు యమ్. ఏ. యల్. టి.]

## ద్వితీయ ప్రశ్న

కంఠాసంధికానుబంధము

తేటగీతలు

పర్జన్యరూపావ-వర్షించునప్పుడు
ప్రాణమా, నీప్రజల్-పరమహర్షమున
నన్నంబుకల్గున-టంచు స్వేచ్ఛగను
నానందరూపులై-యలరుచుండెదరు॥

ప్రాణమా, సంస్కార-వర్జమునైన
శుద్ధుండవైయొప్ప-చూపఁబడియెదవు
ఏకర్షినామాన-నెల్లకబళించి
విశ్వప్రభుండవై-వెలసెదునీవు
మేముహవిస్సుల-మికులనిచ్చెదము
మాతరిశ్వుండవు-మాతండ్రివీవు॥

వాక్కునందుండియు-ప్రాణరూపమున
శ్రోత్రంబులనువ్యాన-రూపంబుతోడ
నయనంబుల నపాన-నామమను పేరిటను
మనసునందునను స-మానరూపమున
ప్రాణమావర్తించి-వదలకీదేహ
మయ్యాదిశుభమైన-యట్లొనరింపు॥

సర్వంబునున్న వ-శంబునఁనుండు
స్వర్గమందలిదినీ-వశమునఁనుండు
తల్లిపుత్రులనుర-క్షించునట్లు
ప్రాణమా మముసాకి-గతిఁజెప్పుచుండి
మాకు శ్రీయును బుద్ధి-మానకయిమ్ము॥

ఇది ద్వితీయప్రశ్న

---

## తృతీయప్రశ్న

అంతఁగౌసల్యుఁడు-నాశ్వలాయనుఁడు
"పూజ్యుఁడాయొందుండి-పుట్టునీప్రాణ?
మెట్టులీదేహంబు-వెనయుచునుండు?
నెట్టుభాగంబులై-యుండుచుండు?
నెందుచేనందుండి-యెడబాసిపోవు?
నధిభూతమునుమఱి యధిదైవతమును
నెట్లుదాధరియించు?-నెట్టులధ్యాత్మ,
మునుబొందు?" ననిపల్కె-మునియిట్లుచెప్పె॥

బ్రహ్మవిదుండ, నీ-ప్రశ్నలుచాల
సూక్ష్మంబులైనను-జెప్పెదనీకుఁ
దెలియఁజేసెదవానిఁ-దెలిసికొమ్మిప్పుడు॥

ప్రాణంబుపుట్టువా-పరమాత్మనుండి
పురుషునికినిఛాయ-పోలికబ్రహ్మ
మునకున్న నదియొప్పి-మనసులోఁబుట్టి

# రూపక సర్వస్వము

1 [భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రిగారు]

2 [మహాభాష్యం సుబ్రహ్మణ్యశాస్త్రిగారు]

ఆర్యమహాశయులారా,

నేటి విషయము నాటకములను గూర్చి. ఈ విషయమున ననేకులు విద్యాధికులగు పండితోత్తములు పలువిధముల విపులముగ వ్రాసియే యున్నారు. ఐనను నాకు దోచిన విషయముల నించుక యీ మహాజనసభలో ముచ్చటింప నెంచితిని. దోషములున్నయెడల నా యజ్ఞతను మన్నింతురుగాక. నాటకములను గూర్చి కొంతవరకు వివరించి ప్రస్తుత మాంధ్రలోకమున వ్యాపించియున్న నాటకములు వాని ప్రదర్శనావ్యవస్థ, వానియందలి లోపములు- వానిని సవరించు విధములు నాకు దోచినరీతిని దెలిపి నా వ్యాసమును ముగించెదను-

తొలుదొల్త నాటకముల యుత్పత్తిని గూర్చి యించుక దెలిపెద. సాధారణముగ నితరుల వేషభాషాప్రవర్తనాదికము ననుకరించుట మానవస్వభావము. ఈ యనుకరణశక్తి స్త్రీ బాలురయం దత్యధికముగ నుండును. శ్వాన, సూకర, మార్జాలాదిజంతువుల యార్పులను, శుకపికాది పక్షిజాతుల మధురరుతములను, ధూమశకటాది యంత్రములవలన వెడలు కూతలను ననుకరించుచుండని యెందఱు బాలుర, బాలుడన వేల, యెందఱు యువకుల మనము గాంచుచుండలేదు. మనుజుల నడకలలోని భేదముల ననుకరించువారి నెందఱిం జూచియుండలేదు. ఒక్కొక్కమనుజుని ప్రసంగాదులలోను, కంఠధ్వనిలోను వాడుకకంటె యించుకేని వికృతి యున్నచో దాని ననుకరించువారి నెందఱిం గనలేదు. ఉపాధ్యాయులు తమ తరగతులలో బోధించునప్పుడు వారియందు బాలురు గనిపెట్టి వికృతివిశేషాదులను క్రీడారూపముగ బాలు రనుకరించుట తరుచు గనుచుందుము. హాస్యగాండ్రు—పగటివేషగాండ్రు మొదలగువారు పలువిధముల కంఠధ్వనుల మార్పు చేయుచు నెక్కుడే సెక్కురుగూడి ప్రసంగించుచున్నట్లు మాటలాడుచుండుట నప్పుడప్పుడు గనుచుందుము. బాలురు తమ జననీజనకుల వ్యాపారములను నభ్యాసములను సాధారణముగ ననుకరించుట స్వభావము. తహసీలుదారుగారి కుమారుడు తనతండ్రి ననుకరించుచు తలకు పాగా చుట్టుకొని, కుర్చీపై గూర్చుండి, తనతో వాడుకొను బాలుర కొందఱి నుద్యోగులుగ నేర్పరిచి వారు గొనివచ్చిన కాగితములపై నుత్తరువులు వేయుట, సంతకములు చేయుట, నేరములు విచారించి శిక్షల విధించి దండించుట, పన్నులు వసూలు చేయుట మున్నగు తమ జనకుని విధులను క్రీడారూపమున ననుకరించుచుండును. అట్లే యుపాధ్యాయుల బిడ్డలు- న్యాయవాదులబిడ్డలు- వర్తకులబిడ్డలు తమ తండ్రుల వ్యాపారముల ననుకరింతురు. ఆడుబిడ్డలు తల్లుల ననుకరింతురు. శ్రీకృష్ణుడు తాను పశుపాలకుడననియు తనమిత్రులను గోపాలురు పశులనియు, తాను రాజుననియు గోపాలురు ప్రజలనియు బాల్యక్రీడల నాడినట్లును, ప్రహ్లాదుడు- తన గురుని పరోక్షమున తానే గురువరు ననుకరించుచు దానవబాలురకు బోధించెననియు, శ్రీమదాంధ్ర మహాభాగవత పురాణమున నతి మనోహరముగ దెలుపబడి యున్నది. ఇటీవల మన విద్యాశాఖాధికారులు గూడ ననుకరణప్రభావమును గ్రహించి పాఠశాలలలో నిదివరకు ప్రచారమున నున్న బోధనాపద్ధతుల వీడి అనుకరణ ప్రధానములగు నవీనపద్ధతుల నేర్పరిచియున్నారు.

ఈయనుకరణమునే లాక్షణికులు సాత్విక- వాచక- ఆంగిక- ఆహార్యకములని నాలుగు విధముల విభజించిరి. ఇవి నవరసముల బుట్టించును. మన యాలంకారికులు నాటకము లేక నాట్యము నిట్లు నిర్వచించియున్నారు.

శ్లో॥ చతుర్విధైరభినయైః - సాత్వికాంగికపూర్వకైః।
ధీరోదాత్తాద్యవస్థాను - కృతిర్నాట్యం తదాశ్రయం॥

పాశ్చాత్యుల నాటకములు కేవలాభినయాత్మక మని నిర్వచించి యున్నారు. ధీరోదాత్తాద్యవస్థాను కృతి యనునది వారికి లేదు. అభినయమునకు ఆశ్రయము నుండవలెనని వారంగీకరించి యుండినను తద్విషయక నియమముల నంతగా పాటించియుండలేదు.

ఇంక నాటకము లెట్లుత్పన్నములైనవి? యనుటను గూర్చి యించుక ముచ్చటించెదము. అనుకరణము నవాశ్రయమైనట్లుండి దాని నాదిజనులు కేవలవినోదమునకై యుపయోగించ సాగిరనియు, నయ్యది కాలక్రమమున రసోత్పాదకమై యుండుటయే గాక భావప్రకటనావకాశములు కూడ కాసాగినందున దాని కభినయమని పేరిడ దగి యున్నదనియు, క్రమముగ నాయభినయము వివిధ నియమబద్ధమై నాటకోత్పత్తి బీజమై యుండి యుండెననియు నూహింప బడియున్నది. ఏదేశమునగాని యభినయోత్పత్తికి భావోద్రేకమే కారణము.

సాధారణముగ సర్వదేశముల యందును ప్రప్రథమమున నాటకములు దైవభక్తి నుద్రేకింపజేయు నవిగను దానివలన నుత్పాదితములుగను నుండెను. ముఖ్యముగ నీ నాటకములు దైవారాధనసమయముల యందును- దైవతోత్సవ సమయములయందును ప్రజలకు భక్తి నుత్పాదించు వినోద కాలక్షేపములుగ నుండెను. హిందూ నాటకము లన్నియు దైవభక్తి సంజనితములు. అవి యన్నియు వైదిక లౌకిక విషయమున భగవదారాధన సంబంధము కలిగి యుండెను.

నాట్యశాస్త్రమును భరతముని రచించెను. భరతనామము గ్రంథకర్తా లేక గ్రంథ వ్యాసునిదా యను విషయము వర్చాంశముగ నున్నది. భరతుడు తన నాట్యశాస్త్రజ్ఞానము దైవదత్తమని తెలుపుకొని యున్నాడు. శివుడు మహానటక శిఖామణి యనియు, నాట్య తాండవములను సృష్టి విశేషముల రెండిటిని లోకమునకు ప్రసాదించి యుండెనని యొక ప్రతీతి. ఈ క్రిందివిధ శ్లోకము సంగీతవిద్యా వినోదమునకు తెలుపబడి యున్నది.

శ్లో॥ ఉద్ధృత్య తాండవముదంచితలాస్యలీలాం-
కర్తుం స్వయం ... సముత్సుకాత్మా-
కామినీ ... క్రమతి రార్ధకాయః-సోయంవిభాతు
విభురాదినటః పురంతః॥

అనాది నిప్పటి వారికి ఘా కాలక్షేపములు గాయించువారి దాసులవలె నొక్కొక్క కథను నృత్యాభినయ యుక్తముగ నొక్కొక్క నటుడు ప్రదర్శించువాడని నిశ్చయముగ దోచుచున్నది. అనంతరము కొన్నాళ్ళకు నిరువురు మువ్వురు కలిసి ప్రదర్శించ వీలుగ నుండునటుల సంవాదరూపమున రచింపబడి దైవతోత్సవాద్యుత్సవ ప్రజా వినోదము నకై ప్రదర్శింపబడసాగినవి. ఇప్పటికిని మన యాంధ్రదేశమున మారుమూల పల్లెలలో ప్రచారమునందున్న రామలీల--కృష్ణలీలలను నుత్సవములలో ప్రదర్శింపబడు రామకృష్ణావతార కథల యందలి వేషసంవాదములును గవిగమ్మ యుత్సవములలో ప్రదర్శింపబడు వేషసంవాదములును- వీధినాటకములు- భాగవతములు- తోలుబొమ్మలాటలు- పగటివేషములు- యక్షగానములు- మొదలగునవి పురాతన నాటకరూపము నకు తార్కాణములుగ నున్నవి.

## పురాతన నాటకోత్పత్తికాలము

ప్రాచీననాటకములలో మిగుల ప్రాచీనతములు సహితము క్రీ॥ పూ॥ 300 మూడు వందల సంవత్సరముల కంటెను పూర్వకాలమున నుత్పత్తి గాంచి యుండినట్లు గన్పట్టుచున్నది. ప్రాచీనతమ నాటకములుగూడ సంపూర్ణ పరిపక్వావస్థయం దే గన్పట్టియుండుటచే వాని యుత్పత్తికాలము దుర వగాహముగ దోచుచున్నది. కావున క్రీ॥ పూ॥ మూడవ శతాబ్దమునకు ముందు చిరకాలము క్రిందటనే నాటకోత్పత్తి యైనదని యూహించుటకు నవకాశము కలుగుచున్నది.

భారతీయనాటకములన్నియు కొన్ని యుత్పన్నావస్థయందును, కొన్ని క్షీణావస్థయందును మతి

కొన్ని శిథిలావస్థయందును గన్పట్టుచున్నందున వాని ప్రారంభోత్పత్తి కాలములు దురవగాహములై యగ వ్యాగోచరములుగ భావింపబడెను. కాని యొక సంగతి మాత్రము విస్పష్టము. హిందువుల నాటకఫణితు లన్నియు వారి స్వకపోలకల్పితములె గాని వైదేశిక రూపకఫణితుల నెంతమాత్రమనుసరించియుండలేదు.

హైందవులకు పొరుగుననున్న మహమ్మదీయులకు పారశీక- ఐగుప్తీయులకు నాటకఫణితియే మృగ్యము. అక్కాలమున నాటకఫక్కిల నెఱిఁగిన చైనా- గ్రీకుదేశీయులవలన భారతీయ నాటకఫణితు లనుకరించినట్లు యాధారములు గనరానందున నది కేవల మబద్ధము. భారతీయ రంగాలంకరణ సాధనములలో నొకటగు తెరకు యవనిక యను పర్యాయముండుటచే వారు యవననాటక ఫణితుల ననుకరించిరేమో యని కొందరు బుద్ధిశాలు లూహించియుండిరి కాని దానికిని తగు యాధారములు లేమింజేసి యదియు కేవల భ్రామికము గాని సత్యము గానేరదు. ప్రపంచకమందలి నాగరిక దేశము లన్నిటిలో నాటకోత్పత్తి యగుటకు చిరకాలము ముందే భారతీయ నాటకములు పరిపక్వావస్థం గాంచి యన్నిటికంటె ప్రాచీనతమములుగ నుండి యున్నవనుట నిస్సందేహము. పురాతనములగు యలంకారగ్రంథములయందు నాటకలక్షణ నియమాదులు వివరింపఁబడి యుండుట చేతను-భరతాచార్యుడు తన నాట్యశిక్షావము దైవదత్తమని నుడివి యుండుటచేతను--నితర నాటకములకంటె హైందవ గీర్వాణ నాటకములె ప్రాచీనతమము లనుటకు పూర్ణ నిదర్శనముగ నున్నది.

నాటకరచనోత్పత్తి:—పూర్వకాలమున నాటక వినోదమును గాని, తద్రచనా కౌశలమును గాని యెఱుఁగని జాతులుకూడ క్వాచిత్కముగ నుండెడివి. నాటకరచనా కౌశలము నెఱుఁగని జాతులు తత్ప్రయోగకౌశలులై యుండవచ్చును. కొన్ని జాతుల వారు నాటకరచనా దక్షతయందలి పరిణామస్థితి నుండిన పిదప తత్ప్రయోగాభిరుచిని పొందియుండుటయును గలుగుచు వచ్చినది. వాగక్తి నాటకములే కలిగియుండును. వారి నాటకము లన్నియు ప్రయోగార్హములును రచనాకౌశల శూన్యములును నై యలరారుచుండెను. రచనాదక్షత గాంచిన పిమ్మట కొందఱు సంగీతసౌష్టవము, నృత్య వైదగ్ధ్యము, వస్త్రభూషాద్యలంకరణము, భూమికా చమత్కారము, రంగాలంకారవైభవము మున్నగు యాహార్య విశేషములయం దెక్కుడు ప్రీతిగలిగియుండిరి. అక్రమమున క్షీణావస్థనందిన నాటకములుకూడ పునరుజ్జీవితములై ప్రబలసాగినవి. మఱికొన్ని నూతన ఫణితుల నలరారు నాటకమ్ము లంకురించి ప్రబలు నవకాశము చిక్కినది. నాటకములు నాట్యయాంత్రికతములుగ నెంచఁబడు నెడల నవి వాగ్రూపకముగ నుండి తీరవలెను. సకల దేశములందును--సమస్త నాగరిక ప్రపంచమునందును పురాణేతిహాసకావ్య గీతాదులు ప్రబలియుండిన తరువాత నీ నాటక వాఙ్మయ మంకురించి, క్రమాభివృద్ధి గాంచి, శాఖోపశాఖలై, కిసలయకుసుమ పుష్ప ఫలయుక్తమై మహావృక్ష ప్రాయమయినది.

నాటకరచనాచరిత్రము:—నాటక రచనారంభము మొదలింతదనుక నుండు కాలమును మూడు యుగములుగ విభజింతము. క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దము మొదలు క్రీ॥ శ॥ పదియవ శతాబ్దము వరకు మొదటి యుగము. నాటికింకను మహమ్మదీయులు భారతభూమి నాక్రమించి పాలింప నారంభించలేదు. నాటికి బౌద్ధమత మత్యంతవ్యాప్తిగాంచి మహోన్నత దశయందుండెను. అక్కాలమున గీర్వాణకవితా సామ్రాజ్య పట్టభద్రు లగు మహాకవిశిఖామణు లిరువురును తమ నాటకరాజముల రచియించియుండిరి. క్రీ॥ పూ॥ ౭౬ సం॥రమున కీర్తిశేషుఁడయిన యవంతీశ్వరుఁ డగు విక్రమార్కుని యాస్థానాలంకార నవరత్నములన నొప్పు పండిత కవిరత్నములలో నాయకమణి యగు కాళిదాసకవి సార్వభౌమేంద్రుఁడే యీ యిరువురిలో ప్రాచీనుఁడు. ఆమహాకవి కావ్యత్రయము నాటకత్రయమును రఘువంశ-కుమార

సంభవ-మేఘదూతలును-శాకుంతల-విక్రమోర్వశీయ-మాళవికాగ్ని మిత్రీయములను నాటకత్రయమును మిగుల రసవంతములుగ రచియించి పేరెన్నిక గాంచి యుండెను. ప్రకృతినుండి యుపమానములు గ్రహించుటలో నీకవీంద్రునికి గల నేర్పాటులకు లేకుండుటచే కదా "ఉపమా కాళిదాసస్య" యని పండితులు నుడివి యున్నారు. ఆ నాటకత్రితయమున శకుంతల నాటక మగ్రగణ్యమై, యనేక భాషాంతరముల కనేకులచే పరివర్తింపఁబడి నాగరిక ప్రపంచమునన్ని జాతీయులచే స్తోత్రపాత్రమై యలరారినది. దానిని సర్ విలియమ్ జోన్సు దొరగా రాంగ్లభాషలోనికి పరివర్తించుటచే, నయ్యది యూరోపుఖండ మందలి యన్ని భాషలలోనునొక్కొక దానిలో 40—50 తర్జుమాలవరకు భాషాంతరీకృతమగుట పాశ్చాత్య ప్రపంచమున భారతీయ నాటక ప్రాశస్త్యము నొప్పిదించెను. ఈయభిజ్ఞాన శాకుంతల మత్యద్భుత ప్రేమాదర్శమనియు, ప్రపంచములోని నాటక వాఙ్మయమున ప్రామాణిక గ్రంథరాజమనియు, లోకములోని సకల భాషాభిజ్ఞమహా విద్వాంసాగ్రేసరులెల్ల నేకగ్రీవముగ నంగీకరించియున్నారు. ఈమహాకవీంద్రుని రెండవ నాటకము విక్రమోర్వశీయము ఇయ్యది శాకుంతల మంత సర్వాంగ సుందరము గాకున్నను, యిందలి శృంగార రంగమొకటి సాటిలేని శృంగార రసప్రవాహమనుట కావంతయు సందియము లేదు. ఇటీవలి నాటక వాఙ్మయమున నీవిక్రమోర్వశీయ కథాసంవిధానముల నాటక కవీంద్రులు తరుచుగ ననుకరించి యుండుటయే యీ నాటకప్రాశస్త్యము చెప్పక చెప్పఁబడుచున్నది. మూడవదియగు మాళవికాగ్ని మిత్రీయనాటక కర్తృత్వము కూడ నీ కాళిదాసుయందే నిలుపఁబడుచున్నది. కాని యీ నాటకరాజము శాకుంతలా కర్తయగు కాళిదాసుని రచన గాక తమవాటి యుజ్జయినీ విభులలో నొకడగు మతియొక విక్రమార్క సార్వభౌముని యాస్థాన కవియగు వింకొక కాళిదాసుఁడు రచించి యుండునని కొందఱు విమర్శకా నిపుణు లభిప్రాయ పడుచున్నారు.

కాళిదాస కవీంద్రుని యనంతరము శూద్రకుఁడను రాజేంద్రుఁడు మృచ్ఛకటిక మను పదియంకముల నాటకరాజమొండు రచించి వన్నెకెక్కి యున్నాఁడు. అది సాంఘిక జీవన ప్రతిబింబితమై మనోహరవర్ణనా యుక్తమై యుండెను. అయ్యది రెండవ శతాబ్దాంతమున రచియింపఁబడి యుండెనని తోచెడిని. పదియవ శతాబ్దమువరకు చిరకాలము ముందే రచియింపఁబడి యుండె ననుట నిస్సందేహము. పిమ్మట కాళిదాసునితో సమానోత్కృష్టను జాన సమర్థుఁడగు శ్రీకంఠుఁడను నామాంతరముగల భవభూతి యను గీర్వాణ మహాకవి తల్లజుఁడు నాటకత్రయరచనమును గావించె. ఈకవీంద్రు డెనిమిదవ శతాబ్దాదినుండి యుండును. ఇతనికవిత కాళిదాసుని కవితవలె సహజశోభావిరాజితము గాక కృత్రిమ శోభాన్వితమై, సుస్పష్టముగ నుండెను. కాళిదాసుని రచన నవరసధ్వన్యాత్మకము గాక వాచ్యరూపకముగ నుండెను. ఏ విషయమున నీతఁడు కాళిదాసునకు తీసిపోయి యుండలేదు. ఆయన నాటక త్రితయమున మహావీరచరితము-ఉత్తర రామచరితములను రెండు నాటకములును గూడ శ్రీమహావిష్ణుని సప్తమావతారుఁడను, ధీరోదాత్తుఁడును నగు శ్రీరామచంద్రుని కథానాయకుఁడుగ నామమానిరూని వీరచరిత్రములను దెలుపు మహా నాటకరాజములుగ నున్నవి. మూడవది యగు మాలతీ మాధవమును పాశ్చాత్య విద్వన్మహాకవియు నాంగ్లేయ నాటక రచనాదక్షుఁడగు షేక్స్పియరు మహాకవి విరచితమగు "రోమియో జూలియట్" అను నాటకరాజము నన్నివిషయముల బోలి యుండుటచే హైందవ రోమియో జూలియట్టు నాటకమని పిలువసాగిరి. ఇందు సాంఘికజీవనమును గూర్చి విపులముగను నసాధారణముగను వర్ణించి యుండెను. విద్వాంసులగు వైమర్శకులీ మాలతీమాధవమున సాంఘిక జీవితాదుల దృష్టాంతసహితముగ వర్ణింపఁబడి యుండుటచే ప్రకరణ మని దీని నిర్దేశించి యున్నారు. ఇక్కాలపు నాటక వాఙ్మయము నందలి యితర గ్రంథములలో వేణీసంహార నాటకము ముఖ్యమైనది.

దీనిని భట్ట నారాయణకవి శిఖామణి రచించియుండెనని యందురు. కాని యీనాటకకర్తయితఁడా? కాడా? యను విషయ మింకను వివాదాంశముగ నున్నది. ఇందలి యితివృత్తము మహాభారతకథ. ఇయ్యది యెనిమిది తొమ్మిదిశతాబ్దములలో రచియింపఁ బడి యుండెనని యెంచబడుచున్నది. ఈనాటకమునందే భత్సభయానకరసము లత్యుక్తిగ వర్ణింపఁ బడినది. వానిఁబ్రదర్శించునప్పటి యాభీభత్సరంగశోభము షేక్స్పియరుమహాకవికళాప్రవీణులగు పాశ్చాత్యనాటక కవులదోరణి ననుకరించుచున్నది.

రెండవయుగము పదునొకండవ శతాబ్దము మొదలు పదునాల్గవ శతాబ్దమువరకు వ్యాపించియున్నది. ఇయ్యది మొదటి యుగమునకును-క్షీణయుగమునకును సంధికాలమని చెప్పనగును. ఈయుగారంభమును మహమ్మదీయులు భారతభూమిని ప్రభుత్వస్థాపనము గావించుటయు సమకాలముగ నుండెను. ఈకాలమున 14 అంకములు దీర్ఘపరిమితముగల హనుమన్నాటకమను నాటకరాజము రచింపబడియుండెను.

ఇయ్యది హనుమద్విరచితమని లోకప్రతీతిగలదు. ఈనాటకరాజమొక కవికృతమని తోచదు. దీనిలో కథానాయకుడు హనుమంతుఁడు. ఇదివృత్తము శ్రీమద్రామాయణకథ. ఇందలి శబ్దప్రయోగములు వ్యాకరణవిశేషములకు స్థానములై యతిప్రశస్తములుగను గంభీరములునుగ గన్పట్టుచున్నవి.

కృష్ణమిశ్రమహాకవీంద్రుని ప్రబోధ చంద్రోదయనాటకమధ్యాత్మిక తత్వబోధకముగ నీకాలమునందే రచియింపఁబడినది. ఇందలి పాత్రములు మహామోహుఁడు, కాముఁడు మొదలగు మూర్తీకృతగుణసముదాయములై యున్నవి. ఆంగ్లేయభాష యందలి బనియను నామకగ్రంథకర్తచే విరచితమగు "పిల్గ్రిమ్సు ప్రోగ్రెస్" (Bunyan's Pilgrim's Progress) అను గ్రంథమున కిది సరిపోవును. ఇట్టి రచనలకాంగ్లభాషలో అలిగోరీ (Allegors) యని చెప్పుదురు.

శ్రీహర్షకవికృతములగు రత్నావళి, నాగానందము ప్రియదర్శికాది నాటకము లీకాలముననే విరచింపఁబడినవి. విశాఖదత్తుఁడను కవిప్రణీతము ముద్రారాక్షస మనెడు రాజకీయనాటకము (Political dramma) కూడ నీకాలమున రచింపబడియుండెను. గీర్వాణనాటకరాజములన్నిటిలో ముద్రారాక్షస మొకటిమాత్రమె చారిత్రాత్మకము (Historical basis) గ నున్నదని పాశ్చాత్య మహాకవులు అభిప్రాయము నొసగియున్నారు.

మొదటియుగముకంటె నీయుగమునందలి కవిత్వమునందలి కథాభాగవర్ణనాదులు, విశేషముగ నుండెను. అయ్యది శ్లేషపద భూయిష్టమై దీర్ఘసమాసబంధురమై, పాండిత్యప్రకర్షగలిగి యుండెను. పండితులకే ప్రాపుపడెను. ఇందు కుదాహరణముగ మురారి విరచితమగు అనర్ఘరాఘవమును దెలుపనగు. ఈనాటకరాజమీయుగాంతరమున రచింపఁబడియున్నది. ఈనాటకము శబ్దాడంబరముగలిగి, పాండిత్యోత్కృష్టత ఉట్టి గిల్లుచు, కాళిదాస, భవభూతిమున్నగు కవివరుల కావ్యములకంటెను మిన్నయగు పండితాదరపాత్రమై యొప్పుచున్నది. ఈకాలముననే యరవ భాషయందలి అరిచంద్రనాటకమను హరిశ్చంద్రనాటకము రచింపఁ బడియున్నది.

ఇంక మూడవది యగు వినాశయుగము పదునాల్గవశతాబ్దము మొదలు నేటివరకును వ్యాపించియున్నది. ఈకాలమున నప్పుడప్పుడు క్వాచిత్కముగ నాటకరచన జరుగుచు వచ్చెనని పాశ్చాత్యపండితాభిప్రాయము. కాని గ్రంథకర్తలు దరిద్రులగుటనో రాజకీయపారతంత్ర్యము కతముననో, మఱియే యితరకారణములచేతనో నాటకగ్రంథము లనేకములు రచింపఁబడియుండినను ప్రచురములు కాకుండుటచేనవి యలభ్యములుగ నుండినవని యూహింపవలసియున్నది. పెక్కురు పండితోత్తములగు కవిశేఖరు లెక్కుడు మిక్కుటియగు గ్రంథరాజములు రచించియుండుటయును, ధనహీనతనో మఱియే కారణాంత

కపి మనఁగాక్ గదా! యని తలంపక, బంధులు గోతల; ట్లు నీ
యసువులఁదీసి కాచెదు మహాత్ముఁ డికెన్నఁడు పుట్టునో కదా!

ఉ. రోగుల, వామలూరు తనయుఁడ్, మతి వ్యాసుని, నట్టి వారలన్
లాగిన నిందఁద్రోసి, యశమున్, లాభమున్, నాయువుఁగానిన్ మహా
భాగులఁజేసి పాత్రముల వ్రాతురు; మమ్ములఁబట్టి నేటికిన్!
జోగిని జోగి రాచికొని చూచిన బూడిదరాలు వెంగలీ!

ఉ. కర్కశబుద్ధి నిమ్నఁగల కాలపు నిందను బుత్తురంబు నా
కోర్కెని జెప్పినాడ, నిది కూడునె? యాద్యకవిత్వ లోక చం
ద్రార్కులకట్టి వారికి ననామయ మబ్బెడుఁగాక! నీదు సం
పర్కము వద్దువద్దు! బగవారలకైనను దుష్ట రాక్షసా!

శా. ఇంపున్ సొంపుల నెంకవేఁడినఁ గడున్ హీనంపు వైకల్యమున్
ద్రెంపన్ నేరఁగలేవు, వృశ్చికము రీతిన్ గోపమే లేకయున్
దెంపున్ జేసె; దికేమిచేసెదవో కాని యెంత క్రూరుండవో!
చంపే చంపక నేల రాచెదవు దుష్టా! నీకు జాలున్నదే?

ఉ. కాళులో, చేతులో, చెవులొ, కన్నులొ, ప్రాణములో హరించి
వాలకమెల్ల మాపెదవు; బాపురె! క్రూరుఁడ వెంతకైన! నీ
పాలను బడ్డవారలనె, బాధల బెట్టెదు, రాక్షసాళియే
మేలనవచ్చు; భారమున మీయది యన్నను గొంత కాచెదన్.

శా. ఏవేళం గనుఁగొన్న బాధ లిడుచున్, హీయంచు దూషింపఁగా;
నా విఘ్నేశు చతుర్థి, బాలకుల యాహ్లాదంబె పాటింపుచున్
జీవం బంతయుఁ బుచ్చనెంచెదవు ఛీ! ఛీ! యెంత పాపిష్ఠివో!
నీ వింకేమి పొనర్తువయ్యో! విధియే నిన్నిట్లు సృష్టింపఁగన్.

ఉ. కుంటరి రోగమంచుఁ గడు దూషణ చేయుదు రెల్లవారు నే
యింటను నీవు చేరినను, హీనతముంబటు నిట్టి జన్మమున్
గొంటఁగ నేల? యెంత యపకీర్తి! కటా! కలశాబ్ధిఁబోలు మా
యింటను జొచ్చినాఁడ; విపుడేని దొలంగుదు మంచివాఁడవే!

ఉ. పొవ్వుఁ బురాణ రోగములు భ్రాంతిగనందురు నీవు సోకినన్
దేవుని సృష్టిలోపలను నీచమటంచు నెవండు గల్గునే?
నీవన దుష్టరోగమని నేను తలంచెద; నేమి తప్పెదున్?
దైవముఁజేరి వేఁడెదను తమ్ముని బ్రోవఁగ నమ్మి కావఁగన్.

ఉ. పిల్లలు మేఁకలున్ గలిగి, పెంపు వహించిన కొంప; యిందులోఁ
బిల్లివిధమ్ముతోప నొక బెబ్బులి చొచ్చినలంతఁ బెట్టెదున్
వెళ్ళఁగఁగొట్ట లేమిచట, వేగమె పాలనచేయువాఁడు!! నీ
కాళ్లను బడ్డవారమిదె కావుము!! కావుము!! దీనరక్షకా!!

# మన దేశ భాషలు

[మహాభాష్యం సుబ్బారాయుడుగారు బి. ఏ. యల్. టి.]

(గతసంచికానుబంధము)

### కోహిస్తానీ

సింధూతీరమందును, స్వాటునందును యున్న కోహిస్థానమునందు ఈభాష వాడుక. ఇప్పుడు పష్టోచేత యిది అణగ ద్రొక్కబడినది. కొన్ని జన సమూహములే యిప్పుడీ భాషను వాడుచున్నారు. వారు ప్రత్యేక విశేషరూపములను వాడుచున్నారు. ఈదేశమును గురించి బాగా తెలియదు. భాషలు కూడా బాగా పరిశీలించబడలేదు. కాష్మీరీవలె వీటికిని క్రిందిభాగర షీనా, మీదిభాగర పశ్చిమపంజాబు భాష.

### లహండా

పశ్చిమపంజాబీ లేక లహండా యను భాషకు, పోట్వారీ, ఛిభాలీ, జట్కీ, ముల్తానీ లేక హిందుకో యను ననేక నామాంతరములు కలవు. ఒక్క జనసంఘమునకు గాని, ఒక్కస్థలమునకు గాని చెందిన విశేషరూపమునే వెల్లడిచేయుటచేత యీపేరులు ఏమియయినూ సరియైనవి గావు. లహండా లేక పశ్చిమము అనుమాట క్రొత్తగా వాడుకకు వచ్చినది. ఇదికూడా తృప్తికరమైనదికాదు. పశ్చిమ పంజాబీ యనగానే పంజాబీ భాషతో సంబంధ మున్నట్టు దుష్ప్రతీతి కలుగును. పశ్చిమ పంజాబునందు తూర్పు 74వ రేఖవరకు యీ భాష వాడుకయందున్నది. ఇంకా తూర్పునకు పూర్వము వ్యాపించియుండెను. అప్పుడు మధ్యదేశ భాషచే నది యంతరింపబడి ప్రస్తుత పంజాబీభాష యుత్పత్తికి కారణమయ్యెను. యీరెండు భాషలకు స్పష్టమైన సరిహద్దు లేదు. క్రమక్రమముగా నొకదా నినుంచి మరియొకటి మారిపోవుచున్నది. 74వ సమాన కాలభూరేఖను సరిహద్దుగా మనము గైకొనవచ్చు. లహండా దానికితూర్పునకు క్రమేణ బలహీనమగుచు నున్నూ, పంజాబీదానికి పశ్చిమమునకు బలహీనమగు గనూ వ్యాపించియే యున్నవి. జనము అనేక కాల మునుంచి మిశ్రమైయున్నది. ఈ ప్రదేశము పవిత్రమైన సరస్వతీనదికి సమీపమందున్ననూ, సంస్కృతి గ్రంథకర్తలు, మధ్యపంజాబును, పశ్చిమపంజాబును నీచముగా చూచుచుండెడివారు. యీప్రదేశమందు గ్రామములలో బ్రాహ్మణులు లేరనిన్ని, ఒకరితో నొకరు పోట్లాడెడు రాజుల వశమందున్నదనిన్ని, యీదేశనివాసులను గురించివారు వ్రాసిరి. జనులకు వర్ణభేదము లేదనిన్ని, వేదములు ప్రమాణములు కావనిన్ని, దేవతలకు యజ్ఞాదులు మొదలైన కర్మలు లేవనిన్ని, కూడా వర్ణించిరి. వీరుమాంసము తింటారనిన్ని, మత్తుగా కల్లు త్రాగుతారనిన్ని, వీరి స్త్రీలు అనేక భర్తృకలనిన్ని వర్ణనకలదు. జాటులు యిట్టి వివాహములను యిప్పటికిని ఆచరణయందుంచిరి. సింధూనదికి పశ్చిమమున అఫ్ఘనిస్తానము వరకునూ అనేక నామములలో నేదోయొకచోటున హిందువులచే లహండా వాడబడుచున్నది. పఠాను ముసల్మానులు పష్టో వాడుచున్నారు. లహండాభాషకు రెండు విశేషరూపములున్నవి. ఉప్పుకొండల కుత్తరమున నొకటిన్ని, దక్షిణమున నొకటిన్ని యున్నవి. దీనియందు వాఙ్మయము లేదు. పంజాబీకి ఉపయోగించెడు లండా యను లిపియే దీనికిని లిపి. గాని పెర్షియను వికారమైన లిపి యిప్పుడు హెచ్చుగా నాదరింపబడుచున్నది.

### సింధీ

సింధు తీరప్రదేశములందు వాడుకలోనున్న భాషసింధీ. యితరసంపర్కము లేకపోవుటచేత, దీనియందు కొన్ని ప్రత్యయములు, సంధులు, ఉచ్చారణలు, యితరభాషలందు కనబడనివి, యున్నవి. పూర్వమిక్కడ పిశాచముల వలసయుండెడిది. పిశాచభాషాచిహ్నాలు సింధీయందు కానవచ్చును. ఇతరవిషయములలోనిది ప్రాంతభాషాసూచకము. దీనియందు వాఙ్మయము లేదు. ఏవిధముగాను యీభాషయభివృద్ధి గాంచలేదు. దీనిని మాట్లాడెడువారు ముసల్మా

నాలు. శార్దీ యను శబ్దములు పొందును. ఇంగ్లీషువారి వశమైనది లగాయితూ ఈభాషకు లిపి పెర్షియను లిపి. లండాలిపికూడ వృత్తరాలకు వాడుకయున్నది. యీభాషకు నాల్గు విశేషరూపములున్నవి. (1) ఉత్తరసింధునందలి సిరైకీ (2) దక్షిణసింధు లేకలాడు నందలిలాడీ (ఇదే ప్రమాణభాష) (3) తాయలేక ఎడారు నందలి థారేలీ, (4) కచ్ఛియందలి కచ్ఛియను నదియను మొదటిది. లహండాకు సంబంధించినది. థారేలీయనునది సింధీమార్వారీలోకి మారుట తెలుపును. సింధీ గుజరాతీలమిశ్రముకచ్ఛీ. సింధీయే బలీయము.

## మరాఠీ

సింధీకి దక్షిణముగా నున్న ప్రాంతభాషలసంబంధమైన ఇండో ఆర్యను వాడుకభాషలమధ్యను, సముద్రమువరకూ వ్యాపించిన మధ్యభాషకు సంబంధించిన గుజరాతీ యున్నది. గుజరాతీకి దక్షిణముగా, అరేబియను సముద్రతీరమందు దమాను మొదలు గోవావరకునూ, మహారాష్ట్రి ప్రాకృతసంభవమైన మరాఠీయను దక్షిణఇండియా యందలి ఇండో ఆర్యను భాషయున్నది. మహారాష్ట్రి విశేషరూపము. సౌరాష్ట్రి యొకప్పుడు గుజరాతునందు ప్రబలముగా నుండెను. గాని క్రమముగా నది మధ్యదేశభాషచే నంతరింపబడెను. ఇప్పుడు సౌరాష్ట్రి యొక్క ఆనవాళ్లు గుజరాతునందే గాక, మరాఠీ వ్యాపించిన దేశమందంతటను ఉన్నవి. యీభాష యిప్పుడు బొంబాయిరాష్ట్రమందు, దక్కనున్నతదేశమున ఉత్తరభాగమునూ, పశ్చిమకనుమలకును ఆరేబియను సముద్రమునకు మధ్యనున్న దేశమును, వ్యాపించియున్నది. నైజామురాష్ట్రమున పశ్చిమోత్తరభాగమందునూ, బేరారు నందునూ యిదే వాడుకభాష. మధ్యపరగణాలలో దక్షిణముగను వ్యాపించినది. మిక్కిలి దక్షిణమున మాత్రము తెలుగు వాడుకభాష. బస్తరు రాజ్యమున ఈభాషాసంకరరూపము వాడుకయందున్నది. యిచ్చట యిది ఒరియావిశేషరూపమైన భత్రియను దానిద్వారా ఒరియాభాషగా మారుచున్నది. ఉత్తరమున దీనికి పశ్చిమకొన నుంచి తూర్పుకొనవరకునూ గుజరాతీ, రాజస్థానీ, పశ్చిమహిందీ, తూర్పుహిందీలు వరసగా నున్నవి. మొదట మూడును మధ్యదేశభాషకు సంబంధించినవి. గాని మరాఠీ వాటిరూపమును పొందలేదు. అవి తే గాక వాటికిని దీనికిని స్పష్టమైన భేదముకలదు. తూర్పుననిది తూర్పుహిందీ విశేషరూపమైన ఛత్తీసుగడీతో సంబంధముకలదియై క్రమముగా ఒరియాగా మారుచున్నది. యీ రెండును ప్రాంతప్రాకృతముల మీద ఆధారపడియున్నవి. తూర్పున దగ్గరగా ఒరియా యున్నది. దక్షిణమున ద్రవిడభాషలు. పశ్చిమమున అరేబియను సముద్రము. మరాఠీయందు, లకారయుక్తమైన ఒక క్త్వార్థక రూపమున్నూ తజ్జనితమగు భూతార్థక్రియారూపమున్నూ, ప్రప్రథమమున సామాన్యముగ వాడుకకు వచ్చినవి. మిగతా ప్రాంతభాషలకు యిది వ్యాపించినది. అనగా ఒరియా, బెంగాలీ, బిహారీ, అసామీనులకు; గుజరాతీయందు లకారహీనమగు మధ్యదేశపదరూపము వాడుకయయినను, అప్పుడప్పుడు లకారయుక్తము నీరూపముకూడా వాడుక కలదు. యిది సౌరాష్ట్రి ప్రాకృతముయొక్క ఆనవాలు. ఈలకారయుక్త క్త్వార్థకరూపము ఆర్యులచే నాక్రమింపబడిన తూర్పు ఇండియాయందే గాక, ఒకదానిలో నొకటి కలిసిపోయే భాషావిశేషములచే ఒప్పుచున్న, పశ్చిమమందు అరేబియను సముద్రమువరకూ వాడుకయందున్నది. యీభాషల అన్యోన్యసంబంధము దీనివల్లనే తెల్లమగుచున్నది. మరాఠీ అసామీజులకు చాల భేదమున్ననూ, ఇది మాట్లాడేవానికి అది తెలియక పోయిననూ, దిబ్రుగడానుంచి గోవాకు 1500 మైళ్లు నాయిన పోయినవానికి యేభాష యెక్కడతం తమైంది క్రొత్తది ప్రారంభమయినదో తెలియదు. బస్తరునందు కొంచ మేమైనా తెలియవచ్చునేమో గాని మరియెక్కడనూ తెలియదు. మరాఠీయందు జనులకు వ్యాపించిన గొప్ప వాఙ్మయమున్నది. గ్రంథకర్తలు నిజమైన వాడుకభాషలో వ్రాసిరి. తద్భవములు హెచ్చు ప్రయోగించిరి. గనుక తద్భవములధికముగా యీభాషయందుకలవు. అనేక విద్వాంసులచే విరాజితంబగు నీదేశంబునందు పండితులు భాషాప్రౌఢత బడయుటకు భాషను తత్సమపదభూయిష్ఠముగ జేయుటకు ప్రయత్నించిరి. గాని ఘాతకమునైన తత్సమములు బెంగాలీ నంత యధికముగా, గ్రంథములందు చేరలేదు. ముసల్మానులు మొన్న మొన్న దేశముపై దండయాత్ర వెడలిరి. పిదప ప్రతినాధులైరి. కాబట్టి పెర్షియను పదములు గాని తద్వారా యితర పదములుగాని చేరినవి. చాలా తక్కువ. దీనిన్నీ

బడ్డవి. అందుకు సహాయం కాశీపతిరాజుగారు పది వేలు చేతికి యివ్వగానే నీకున్న బుద్ధి మళ్లిపోయినది వారికి ఖర్చు కావడమున్న మీరు సంపాద్యం కావడమున్న రెండూ మాకు కిఫాయతే కాని సంశయంలేదు. కాబట్టి మాకున్న సంతోషమయినది సామ్యమని సెలవు యిచ్చినారు. అంతట నవాబువారు శ్రీకాకుళం పోయిన వెనుక విజయరామరాజుగారు తన రాణువను యావత్తు కూడికా తిరుగా శృంగవరపుకోట పట్టుకుని వారికి దేశం యివ్వక చాలా కష్టపెట్టినారు. యిప్పుడు వీరు కోట పుచ్చుకున్నా కాశీపురం లోపల వుండి పితూరీ చేస్తూవుండేవాడు. ఆ కాశీపురం పుచ్చుకోవడానకు వీరితాలూకు రాణువ నాలుగు వేలు ఆ స్థలంలో మరణమయితే అలాన స్వాధీనానకు వచ్చును అంత దారుణాలకు విజయరామరాజుగారు వప్పక సూత్రంచాతను తమ ఫంజునావకుండా మించీ రాణువ ఖర్చు కాకుండా చతుర్ధోపాయములను విచారించి మరి గొంగుపాటుకు తెచ్చుకున్నారు దోచువించ దొర్కసమస్థానం గనక అయితే యంత ఖర్చు అయినా చోరపాటి సాధింతురు. ఒకసారి కొట్టి తీసుకున్న సంస్థానం తిరుగా రెండోమారు కొట్టి పుచ్చుకుంటే మించి దోపు దొరకదు గనుక మించి మందిని చావడానకు అనుకూలించినవారు కారు అంతట తిరుగా రాజుగారికి నారాయణపట్నం వెళ్లవలసిన పనులు తగిలినది గనుక కాశీపతిరాజుగారని పిలుపించి తమ దండుఖర్చు యావత్తూ ముజరా తీసుకుని తగ్గేసమస్థానం వారి అధీనం చేసినారు యీతీరున కాశీపతి రాజుగారు ఫితూరీ చేసినందుకు కిఫాయతు యేమంటే—నవాబువారికి కట్నం కానికెలు కింపనున్న రాజుగారికి దండుఖర్చులు కూడి యివ్వవలెనున్న వీటితోటి యింట్లో పెండ్లాం మెడలో మంగళసూత్రం దేఖీలు పోయిందిగనుక గర్వనివారణమెన్మి కాశీపతిరాజుగారు బొబ్బిలివారి మాటలువిని రాజావారితో బలవద్విరోధము చేసుకుని మా దివాను అయిన పొణుకుపాటి వెంకటరామన్నగారి యీజగి పాత్యమాటలు ముందరగా చెప్పితే ఆమాటలు వినక చెడిపోతిమి బలవంతులతోటి యన్నటికి విరోధం కాకూడదు అని చేశ

సందుకు అసాధ్యం అయినదని వురువణిగి అంతట నుంచి బహుభయంకళ్లి వున్నారు—అంతట విజయరామరాజుగారు వారిని యింతటినుంచి సర్కారుపట్ల భయంకళ్లి వుండుమని సెలవు యిచ్చినారు యీతీరున వుండగా నారాయణపట్నంవారికి బొబ్బిలివారు బోధ చేసి సహంగతి। మీరుపూసపాటివారికి జమాబంది యేమను యిస్తారు వారు మీమీదికి యుద్ధానకు వచ్చినప్పుడు మేము కనిపించుకున్నాము కాము గనక నా యిప్పుడున్న మీరు యెదిరించుగు యింతకు పూసపాటి విజయరాముడు మీమీద దండుయెత్తితే మాకున్న సమాచారం తెలియును తెలుస్తుంది మా దేశం మీదినుంచి రావలెను కాబట్టి అప్పుడు మీకు మేము మద్దతు వస్తూ వున్నాము అని వారికి యెత్తు యిచ్చి బోధపర్చి రాజుగారికి పల్కకుండా చేశినారు యీసమాచారం యావత్తూ రాజుగారి ఫవుజువారును వెలగాం కోటలో వుండి విని తమఖాముందు విజయనగరం కోటలోవుండగా వ్రాయించిపంపించేనగకు రాజుగారు విని బహు కోపం తెచ్చుకొని ఫంజుఫ్వావత్తు కూచికా బొబ్బిలిమీద దిగినట్టుగా దిగి లఢాయీచేస్తూవుండి అక్కడిసమాచారం నారాయణపట్నంవారికి తెలియకుండాచేసి నారాయణపట్నంమీదికిన్ని కొంతలష్కరుపంపించి నారాయణపట్నం సమాచారము బొబ్బిలివారికి తెలియకుండా చేసి నారాయణపట్నంవారిమీద తమ పరాక్రమం యావత్తు అగపర్చినారు. గనుక రాజుగారి రాణువ యుద్ధంవల్లనేమి చలిజ్వరాలవల్లనేమి అనేకమంది పరలోకానికి పోయినారు. యీ నారాయణపట్నం వచ్చేవగకు రాజుగారి దగ్గర నలభైవేల ఫవుజా వున్నది. గనుక చలంసాధించవలెనన్న కాపణాన్యం విచారించినారే కాని యెంత ఫవుజు వచ్చినా ఫరవాలేదనుకున్నారు. యీ నారాయణపట్నంలో నీరు ఎంతో విషపునీరు ప్రపంచంలో యెక్కడా లేదు.

ఆ సమయమందు బొబ్బిలి నారాయణపట్నం సందున రాజువారిసైన్యం నాలుగువేలు పాళెమైనది. నారాయణపట్నము వారి సైన్యమున్న ఆలాగే

షేనా ఆయను గన్క దుర్బలులై యిదివరదనుకా రాజువారితోటి విపి తంగాళుండి సుఖంగావుండుకుంటిమి. బొబ్బిలివారి మాటలు విని యింత మోసబోతిమి. ప్రజలు యీవత్తున్న చచ్చిపోయిరి. యికను మన బ్రతుకు రేవి వృన్నది. యింతటకిన్ని బలవంతుడితోటి విరోధంచేసి సరితూగవలెనంటేప్రలివి. మాచి నక్క వాతపెట్టుకోవలెననే సామ్యత గాని క్రియలేదు. అని అక్కడనుంచివారు విజయరామరాజుగారివద్దకి తమ వకీలును పంపించి సమాధానం చేసుకురమ్మని పంపిరి గన్క అతనువచ్చిఅన్నమాటలు। మీతాలూకుపరంజాన్ని విస్తారం హాతమయ్యినది మారాజువానున్ను చాలా హాతమయ్యినది తమరు పహాచేసి శెలవుయియ్యవలెను అంటె॥ రాజుగారు శెలవు యిచ్చినమాటలు యేమంటె। యిఖ పదివేలు లయుమ్కైనాగాని మాకు ఫరవాలేదు। చలం సాధించడంమాకు స్వామ్రాజ్యచేకూరుట అని రాజుగారు పన్నే పటకు వకీలు మనవిచేసుకున్న సంగతులు మాకు గ్రహచారం చాలనందుచేతను రంగారావువారి మాటలు విన్నాము గన్క మాకు యింత అనుభవం అయ్యినది కాబట్టి మాతకిషీరు మాపుచేసి మమ్మున బాగుచేయవలెను. అని అనేవరకు ఆమాటలు రాజుగారువిని మీరుమాకు యెక్కువ కట్నం కానికెలు యివ్వాకద్దు మేము విజయనగరం తిన్నివచ్చినవాటనుంచిన్ని నేటివరకు అయ్ని దండుఖర్చులు ముజరాయిప్పిస్తె తాలూకా మీ ఆధీనం చేస్తూవున్నాము యీ సలహా మీకు సమ్మతిలేక పోయనా మీకు యుంతశక్తివుంటె అంతశేవు యుద్ధంచేయడమున్ను మాకుమంచిది అని వుత్తరం చెప్పినారు గన్క తిరుగా వకీలు మనవిశేసుకున్నది—మీ మదండుఖర్చులు ముజరాయివ్వమని శెలవుయిచ్చినారు యీప్రకారం యిచ్చేవరకు మాకు సమస్తానం అశలేనిలేదు మా తాలూకా యింతమాత్రం గన్క మాహావాలు తెలిశిఫుండిన్ని యీప్రకారం శెలవుయిస్తె మేము యేలాగున భరించపోతాము। అదిగాకా మీరు తండుకు త్తదంకాయిదమాత్రమేగాదు బొబ్బిలివారిమీదనుప్రతిసంవత్సరం దండు మీరు యెత్తుతూవున్నారు అట్లాగె యీసంవత్సరమున్ను దండుయెత్తినారు మ్మాగ్రహాచారదోషం వల్లను బొబ్బిలివారి మాటలు వినబట్టి యింతియోగం పాశికింది కాబట్టి యీ ఖర్చులు యివ్వడానికి మాకు శక్తిలేదుగాని జీతాలు మినహాభత్యాలుమాత్రం యిస్తామని నిండా మనవిచేసుకునే వరకు రాజుగారు సమ్మతించి బకిషీలను పిలుపించి లెఖలచూపించిఅర్ధణం దాఖలు చేసుకొనివారికికవులు యిప్పించినారు ముందు జరగవలసినసంవత్సరములకు జమాబందినిర్ణయం చేసుకొని వారికి శెలవుయిప్పించినారు. తదనంతరం బొబ్బిలి రంగారావుగారిమీదికి లష్కరుయావత్తు తయారుచేశి దేశస్తులను అందరిని రమ్మని తలబుత్రాయిస్తె దేశస్తులు అన్నమాటలు—యీతూరి వెలమలు అంతా అభిమానించుకొని యేకస్తులై యున్నారు మనం వారితో యుద్ధంచేసి జయించలేమని అన్నారు. అందుకు రాజుగారు బహుకోపంచేస్తే అప్పుడు బుర్రా బుచ్చన్నగారువిని శాంతపర్చి చెప్పిన ఆలోచన యేమంటె। యీతూరి మేము లడాయికి పోవడం మొఖూబు చేసి మీకుప్రతిగా పుస్సపాటి రామచంద్రరాజుగారిని అంబారిలో కూచుండబెట్టి సకలసంస్థానలతోటి సైన్యంపంపించడం వుత్తమకార్యమని మనవిచేశేవరకు ఆమాటలకు రాజుగారు సమ్మతించి ఆప్రకారంగానే బొబ్బిలిమీదికి పంపించేవరకు అక్కడ—రాజా బొబ్బిలి రంగరావుగారి తాలూకు సరదాలున్ను అందరు అభిమానించుకొని అట్టహాసంతోను మేలయిన మస్నెధారులు యుద్ధసన్నద్ధులై వచ్చి మన ప్రాణాలు పోతేపీడపోయను నేటిదినం యేలాగైనా విజయరామరాజును పొడిచి పారవెయ్యవలెను—యితనితోటిగా మనసంస్థానం పీడ వదలదని ఆలోచ్నచేశి మేలైన సరదారులు అంతా ఐక్కమొనచేసుకొనివచ్చి రాచవారి సైన్యంమీదపడి అంబారీమట్టుచున్న ఫంజాను యావత్తుచంపి అంబారీలోవాడు విజయరామరాజుగా తలచి యీటెలువేశి గుచ్చి కిందికిదింపి చూచేవరకు రామచంద్ర

రాజుగా అగపడేవరకు అంతట వెలమవారు విజయరామరాజు అని యింత ఆర్భాటోపం చేసి హాఫీజుభైన సరదారులగాలంపోతిమి లేదివకు సరదారును చంపితిమి అని—యింత ప్రయత్నమున్ను నిష్ఫలం అయిపోయెను అని దుఃఖించి, రామచంద్రరాజు తలకాయ పుర్రెకు పంగనామాలు పెట్టి సాయంకాలానకు విజయనగరం పంపించేసరకు అప్పుడు ఆయనకొమాళ్లు చూచి బహుదుఃఖపడేవరకు విజయరామరాజుగారు వారికి దుఃఖోపశమనము చేసి పోయినవాడే విజయరామరాజు వున్నవాడే రామచంద్రరాజు అని దిలాసాగా వుండమని తమజాగీరులో రేగులవలస అనే పర్గణా జమీదారీ వ్రాయించి యిచ్చి కోటకట్టించి యిచ్చినారు గనుక అనుభవిస్తూ వచ్చినారు విజయరాజుగారు వున్నమట్టుకున్ను జర్గినది సీతారామరాజుగారి రాజ్యాంగం వచ్చేపర్యంత్రమున్ను జరిగినది.

రామచంద్రరాజుగారి గతిచూచి విజయరామరాజు అనుకున్నమాటలు యేమంటే నేటిదినం గనుక నేము లడాయికి పోతే పగలోకానకు వెంచేతుము బుచ్చన్నగారి ఆలోచన మాకు బృహస్పతి ఆలోచన అయ్యినది అని తమ్ము బ్రతికించినాడని చాలా సంతోషపడి బుచ్చన్నగారికి పల్లకీ బహుమానం చేసి నన్ను మీరు బ్రతికించినారు అని చాలా స్తోత్రంచేసి అనేక విధాల మెచ్చుకున్నారు.

అప్పుడు అక్కడ ఫవుజుదారు ఖాపరల్లీఖానుడివారికి రాజుగారికి సరిపడకుండావుండిగనుక యిందుకు యేమి ఆలోచన అని అడిగితే అతని దగ్గిరవున్న ఫంజాదారుణ్ని విడతీసి గోదావరి దాటించమన్నారు గనుక అప్రకారంగానే చేసినారు. అటుతరువాతను

తిరుగా హైదరాబాదునుంచి యీకలింగ సర్కారుకు ఫవుజుదారుడు వచ్చె గనుక రాజుగారున్ను వారున్ను కల్సుకుని బహు స్నేహితులై ప్రవర్తిస్తుండగా

నోకానొక నాటి సమయమందు ఆఫవుజుదారుడు రాజుగారి మర్మం తెలియవలెను. అని మనస్సున యిచ్చయించి ప్రస్తాపకాలమున గారితోను మీరు అయితే ఫంజా విస్తారం పెట్టుకున్నారు మీరు యేతీరున గడుస్తుంది సర్కారుకు యిచ్చే పేష్కషు విచారిస్తే లక్షాతొంభయివేల రూపాయీలు మీకుయింకా మిగిలితే అంతమాత్రం మిగిలేని యిందువల్ల మీకు ఖర్చులే జరగవట్టుగావున్నవి అని మంచిమాటలుగా అడిగేవరకు యీ ఫౌజుదారుని కపటం తెలియక యీవత్తూ తనమర్మం చెప్పుతూవుండగా యింతలో బుచ్చన్నగారు రాజువారిని చూచి నవాబు యెంత యిష్టుడైనా నమ్మి మర్మం బయలుపర్చరాదు అని మనవిచేసుకునేవరకు బుచ్చన్నగారిమీద బహుకోపంవచ్చి తురకవాడియిష్టంవల్లనుయీరీతున మాటలుఅనవలసి అయి బుచ్చన్నగారిని శీఘ్రతిపల్లికోటలో ఖయిదు చేయించినారు యిట్లా అయిదు ఆరునెలలు అయ్యేవరకు ఫవుజుదారుడు విజయరామరాజుగారితోటి మీసర్కారు పదహారులక్షల రూపాయీలకు వీలు చేసుకుని మాకుమాత్రం లక్షాతొంభైవేల రూపాయీలు పేష్కషు యివ్వడం యేమిసబబు యీ సంవత్సరం నాలుగులక్షలరూపాయీలు దాఖలు చెయ్యకుంటె అనుకూలం కావని చాలజబరుదస్తీ చేసినారు అప్పుడు రాజుగారు మీతోటిహాస్యాలకు అన్నాము గాని తాలూకాలో అంతపయికం రావడంలేదు. అని ఘట్టిగా చెప్పేవరకు ఆమాటలకు నవాబువారికి నమ్మకంతగలక వీరిమీద దండుయెత్తి విజయనగరంకోటమీదికి రాక రాజుగారి స్త్రీలు యీవత్తు పోడాడికోటలోను వుండగా ఆకోటచుట్టు ముట్టడిచేసి రాజుగారికి—నీ భార్యలు వారిని మట్టేసట్టలు మోయిస్తామని వుత్తరం వ్రాయించి పంపించేవరకు అప్పుడు రాజుగారు యేమి ఆలోచన తెలియక ఖయిదులో వున్న బుచ్చన్నగారిని పిలిపించి మునుపు మీరు సెలవుయిచ్చిన మాటలు వినకపోయినందుకు యింత అనుభవంఅయినది,

# "తెలియదా భవిష్యదవస్థ"

[భమిడిపాటి రామసోమయాజులుగారు]

భావగిరినుండి నిత్యము-పారుచున్న
యోజిసాప్రవాహము, కడ-కొక్క-చోట
పాయలై పోవుచున్నది!-ప్రజ్వలితము,
సంతతానంద సుతరంగ-సాంగమైన
ముక్తివార్ధిని కలయునో!-మూఢగాఢ
భీకరారణ్యసీమల-పృథ్విలోన
పాతకక్షితి నింకునో!— X ప్రకృతికాంత
మోహకాంతి సముజ్జ్వల-పూరితాంగి,
తనను ప్రేమంపు బల్కులం-గలుగజేసి,
మధ్యంతరిత కాంత సీ-మలను, నాటి
పెంచు సుజ్ఞానతరువు, తా-పెరిగి పెరిగి
యల్లుకొని మానసము నిండె;-నాత్మలోన
నట్టులేయుండి నాశన-మౌనొ, లేక
పుణ్య ఫలములొసంగి, సం-పూర్ణమైన
నిజసుఖంబొన గూర్చునో!— X నిర్మలంపు
నీలి యాకసమున రేయి-నిలచి వెలుగు
చుక్కలన్నియు నవ్వుచు-చూపుదారి,
ప్రేమ సౌధాంతరమునకే- వెడలగలనో;
లేక దుర్గాంతమైనట్టి-చీకటులకు
నన్ను గొనిపోవుచున్నదో!— X నమ్మక రథ
మల్ల మగుణ ప్రఫుల్ల శు-ద్ధాత్మ నీర
జాప్త పూదోటలోనికే-యరుగగలనో,
లేక, చక్రంబు విరుగంబో-లేక, మధ్య
నాశలారగబడి రసా-భాస మగునొ?
సంశయానిలకలిత, ము-జ్వాలితమైన
భయదవాగ్ని యడంగి, ని-ర్భయ సువర్ణ
ధారలం బచ్చనై, యాశ-తరువు పెరిగి,
ధన్య జీవనమౌనొ!— మి-థ్యాతరంగి
ణీ బలమ్మున నాలోని- నిర్మలాత్మ
కొట్టుకొని పోవునో!—అతి-గూఢ మగుచుం
దెలియదా భవిష్యదవస్థ-తేటపడుచు!

---

# వేమన యోగి

[దేవరకొండ జగన్నాథరావుగారు, యమ్. ఎ.]

యోగ యోగీశ్వరుఁడును గవిశేఖరుఁడు నగు నీ వేమన పంటరెడ్డి కులసంభూతుఁడు. ఇతని జన్మకాలము సుమారు పదునాలుగవ శతాబ్దాంత మని తెలుచున్నది. ఈయనతండ్రి కొమరగిరి వేమారెడ్డి. అను వేమరెడ్డి, రచ్చ వేమరెడ్డి యను వా రీతని యన్నలు. కొన్ని వంశములయందు 'వేంకట' శబ్దము వలెనె యీ రెడ్డి వంశమునందు బుట్టినవారి పేళ్లకు వేమశబ్ద మతుకబడి యున్నది. ఈరెడ్లు నూఱు సంవత్సరము లాంధ్రదేశమున రాజ్యమేలిరని చరిత్రవలన దెలియ వచ్చుచున్నది.

అయినను, నీపంటరెడ్డికులమున 'వేమన' యను నామము వెలయుటకును, నీ కులమువారికి రాజ్యప్రాప్తి కలుగుటకును చిత్రమైన కారణమును జెప్పుచున్నారు. దాని సత్యాసత్యము లెట్లున్న నయ్యది వినుటకు గొలుపుచున్నది. కాన నిందొకింత వివరింతము.

తొల్లి 'వేమన' యను పేరుగల కోమటి యొక డుండెనఁట! అతఁడు మహాశివరాత్రి యుత్సవమునకుఁ దక్షిణ జనులవలెనే తానును శ్రీశైలమునకుఁ బయనమాయెను. శివరాత్రి దినమందు మల్లికార్జునస్వామిని దర్శించుటకై యచ్చటి యాకాశధారయందు వేమన స్నానమాడఁ గడంగెను. ఆసమయమున నాకొండపై కొంచెంత దూరమున నొక గారుడోపల మొకటిని కంట బడెను. అయ్యది గాంచి యదియొక పచ్చరాయి యనియు, దానిని నా సెట్టి యినఁ బెసినఁ దన దరిద్రత యెల్ల నంతటితోఁ దీరుఁ గలదనియు నెంచువలనఁ దానెన్ని ప్రయత్నము లొనర్చియైన నాగారుడోపలమును జేకొనవలె ననియుఁ దీపేరవణిజుఁ డుద్దేశించుకొనెను. తన తలంపు మంత్రి యన్వారితోడను జెప్పకయె శ్రీ[illegible] శ్రీశైలనామం దగు మల్లికార్జునన [illegible]

ప్రొద్దుంకటికి గ్రుంకును. కార్తికజనంబెంతట స్వామిని బాసి యేగుదురను కొట్లాటలో వేమన మునిఁగి తేలు చుండెను. ఇట్లుండ నొకటిరెండు దినములలో యాత్రార్థము వచ్చిన జనులెల్ల నొకరొకరివెంట నొకరు తిరుగఁ దమతమ గృహములకుంబోయిరి. వేమన మాత్ర మావచ్చు రాత్రిని భూర్చి పరికింప వచ్చుటనే యుండెను. అప్పుడా దేవాలయమున స్వామి నర్చించు నర్చకుఁడును వేమనయు, దప్ప మరి యెవ్వరు లేరు. ఈ వేమన తన గృహమున కరుగక యచ్చటనే యుండుటఁ జూచి యా యర్చకుఁ డచ్చెరువొంది కతం బేమని యాతనిఁ బ్రశ్నించెను. జన్మముచే గోమటి యగుటఁ దొణుకు బెణుకు లేక సమయమునకుఁ దగినట్లాతఁ డయ్యా! నేనీ మల్లికార్జునస్వామి నాలుమాసము లిచ్చటనే యుండి సేవింతునని వ్రతము బూని వచ్చియుంటిని. ఆవ్రత మిప్పుడు నడుపుకొనుచున్నాఁడ నని ప్రత్యుత్తర మొసఁగెను. అందులకాయర్చకుఁడు, సరే నీయిచ్చవచ్చినట్లు సేయుము. కాని యుత్తరద్వార కవాటము మాత్రము తెరచి యటు పోవలదు. అని యాజ్ఞాపించి యథేచ్ఛం జనియెను.

అనంతర మాపర్వతమునందును దేవాలయము నందును వేమన తప్ప మనుష్యమాత్రుఁ డెవ్వఁడును లేఁడు. అర్చకుఁడు తిరుగ వచ్చునేమో యను భయముచేత మరి నాలుగు దినములాఁగి యైదవనాఁటి యుదయమున స్నానమాడి, మల్లికార్జునుని సేవించి వేమన యుత్తరద్వార కవాటము తెరచి యావైపు వనే కొంతదూరము ప్రయాణమై పోయెను. స్వభావమున బిఱికియైనను గారుడోపలమబ్బిన గొప్పలాభము బడయ వచ్చునను పేరాశచే నీవైశ్యుడు లేని ధైర్యము దెచ్చుకొని యుండుటచేఁ గా నా పర్వతారణ్యమునఁ బోవసాగెను. అట్లు కొంతదూర మరిగినపిదప నాతని కొకవిధమైన వింతయాకులు గల చిన్న మొక్కలతో నిండిన ప్రదేశము గనఁబడెను. ఆయాకులు గాంచి యవి వింతగా నుండుటచే గొన్నింటిని జిదిమి చేతులలో నలిపి పసరుదీసి, వాసన జూచి యాపని మనమున కానందముఁ బొంది, తనమార్గమున బోవసాగెను. ఆమార్గమునఁ దనకుఁ దనమైనున్న యుత్తరీయమును, జేతనున్న యినుపకట్టుగల చేతికఱ్ఱయు దప్ప మరియొక సహాయ మెద్దియు లేదయ్యె. అట్లా యినుపకట్టుగల చేతికఱ్ఱను ధరించి కొంతదూర మరుగుచుండ నాకస్మికముగా నా యినుపొల్లు బంగారమై తళతళ మెఱయసాగెను. అప్పుడా వైశ్యుడు పరమాద్భుతముఁ జెంది తనచేత నింక నారసట్టి యాపసరు మాహాత్మ్యమే యని యూహించి తన లేవడియెల్ల నాటితో తొలఁగెనని యమితానందమును బొందెను. ఈ యపారసంతోషములో దన మొదటి ప్రయత్నము మఱచి వెంటనే దేవాలయమునకు మరలి వచ్చెను. అచ్చట యాత్రికులు విడిచిపోయిన రెండు కుండలను జేత ధరించి తిరుగ నతి త్వరితముగ నావింతయాకులకడ కరుగుదెంచెను.

ఓపికతో నాయాకులెల్ల గోసి వానియందలి పసరెల్ల నీరెండు కుండలలో నింపెను. అంత తృప్తి జెందక వేయికుండలైన గావలెనని యావైశ్యుడు గోరుకొనెను. గాని మల్లికార్జును డాతని యత్యాసను గీర్పహర్య్య పైపెచ్చు భాండములలో నొకటి రాయి తగిలి పగిలిపోయినందున నందలి పసరెల్ల నేలపైబడి యా కోమటి నత్యంత చింతాంబుధిలో ముంచి వేసెను. సముద్రముచే కూడియు ముంతెడు జలమేకా యని కొంత తన యవస్థకు వగచి పగలని భాండము దన నెత్తిపై నిడికొని త్వరితమున నుత్తరద్వారము దాటి గుడిలో బ్రవేశించెను. అప్పుడు వెంటనే నాకస్మాత్తుగ నొక పెద్దశిల యెచ్చటనుండియో యాద్వారమునకడ్డముగ వెలుపలిభాగమున బడి నాటినుండి నేటివరకా ద్వారము దెరచుటకు వీలులేనట్లు స్వరించెను. అప్పుడది గాంచి యారాయి తన గుండెలోఁబడినట్లు దిగులొంది తాను మరికొన్ని భాండములను గొనివచ్చి పసరుతో నింపిన వచ్చునని కొన్న తలఁపెల్ల వ్యర్థ మాయెను గదా యని చింతించుచు తన కింతియే ప్రాప్తమని యాపసరుకుండ భుజముపై నిడుకొని దేవాలయము బాసి యాత్రమార్గము బట్టెను.

ఆమార్గమం దాతనికి మిఱ్ఱుపల్లములుగాని చుట్టుప్రక్కలనున్న చెట్టుచేట్లుగాని మఱి యేవస్తువులుగాని కనరాకుండెను. శ్రీశైలవాసుని ధ్యానము చేసి యా పసరుతుండను గొనియేగుచున్నందులకై యాతనికన్నులు గానిపింపలేదని మదువవలను పడుచు. కన్నులు స్ఫుటములుగా గాన్పించుచునే యున్నవి. అయిన వాని మనస్సు మాత్రము బహిర్గతముగా లేదు. తన మనస్సంతయు నా పసరుమూలమున దనకొనగూడు భావిసుఖములయందు లగ్నమయిపోయెను. తాను శీఘ్రముగ దనగ్రామము జేరుదునని యిల్లు చేరినతోడనే కొన్ని యినుపకడ్డీలను గొనివచ్చి యాపసరునందొక బిందువైన వ్యర్థముగాకుండ చాలినంత వఱకు నా యినుపకడ్డీల కత్యంత జాగరూకతతో బూసి వానినెల్ల స్వర్ణముగావింతునని యూహించెను. తరువాత నా బంగారుకడ్డీలలో గొన్నిటిని విక్రయించి రూకలుచేసి యొకగొప్పమేడ కట్టుట కూహించెను. మిగిలినకడ్డీలలో గొన్ని కరగించి తనభార్య కేనువారములకు దగిన తొడవులు చేయింపదలచెను. మఱికొంత బంగారమమ్మి యేనుగులు గుఱ్ఱములు బండ్లు మొదలయినవి కొని యయ్యైశ్వర్యములతో దులదూగుట కెంతయు గుతూహలుడయ్యెను. ఇట్టి మనోహరమైన తలపులతో బోవుచున్నందున వానికి మార్గాయాసమింతయైన దోచ లేదు. ఇట్లుపోవ సాయంతనమగుసరి కాతడనుమకొండపరిసరప్రాంతమున కరుగుదెంచెను. అప్పటికొంత తడవు తనభాండము దించి విశ్రమించి బాగుగ జీకటి నలుప్రక్కల గ్రమ్మినతోడనే తిరుగ బయలుదేరెను.

అతడు గొన్నియడుగులు నడచినతోడనే దారిలో పూర్ణచంద్రునివలె గుండ్రమగు మొగమున తెల్లని దట్టములగు మీసములు మిలమిల మెఱయ మందనిదుదలగు కన్నులవెంబడి వెడలుచున్న చల్లని చూపులు హృదయమునందలి కరుణార్ద్రభావమును వెలిపుచ్చుచుండ నాజానుబాహువులును ధృఢగాత్రమును గలిగిన పురుషుడొకడు పురోభాగమున మఱియొకడొక ప్రబలకాంతిగల దీపము ధరియించి నడుచుచుండ మనవేమన కెదురాయెను. పురుషుని జూచినవారి కాతడా సమీపమునందున్న గ్రామమునకు నాయకుడు గానోపునని పొడకట్టును. ఈయన పేరల్లారెడ్డియందురు. ఈదొంతి యల్లారెడ్డి వేమనను జూచి "అయ్యా నీవొంటరిగ నెచ్చటనుండి వచ్చుచున్నవాడవు" అని ప్రశ్నించెను. అందులకా వేమన నేను మొన్నటి శివరాత్రికి శ్రీశైలముపోయియుంటిని. అచ్చట యాత్ర సేవించి తిరుగుదలలో నిక్కడకు నతి దూరమునందున్న మాబంధుగుల యింట నింతవరకుండి నేడు మాస్వగ్రామమునకు మరలుచున్నవాడ.

యీరాత్రి మీగ్రామమునందెచ్చటనైన బస ఇచ్చెదరా యని యడిగెను. ఆమాటలు విని యల్లారెడ్డి సంతోషముతో నవశ్యము దయచేయుడని వేమనను దనగృహమునకు దోడుకొనిపోయి యందొక గది యాతనికి విడిది ఇచ్చెను. అనంతరము గ్రామములో నున్న పెద్దకోమటియింటికి పాకద్రవ్యములు సమస్తము బంపి యవి పచనము, జేసి వేమనకుం బెట్టుమని వర్తమానమంపెను. అల్లారెడ్డి దొడ్డకాపు కనుక యాతని సందేశమును శిరసావహించి యాయూరి పెద్దకోమటి యాపాకద్రవ్యములను సత్వరము వండించి వేమనను భోజనార్థము దనగృహమునకు గొంపోయెను. అనంతర మాదొంతి యల్లారెడ్డి యతిజాగ్రత్తగలవాడు గావున దన పరిపాటి చొప్పున నొక చిన్న దివ్వె దాల్చి తన పసువులు గొడ్లు మొదలయిన వన్నియు గ్రమముగ నిల్లుచేరెనో లేదో యని తెలిసికొనుటకై పశువులపాక కరుదెంచెను. పాకయందు పశువులన్నియు హాయిగా పరుండి నెమరువేయుచు జూపఱకెల్లం జిత్తశాంతియు మనస్తృప్తియు దెలుపుచుండెను. అహా! వానిది గదా! సౌఖ్యము అట్టిసౌఖ్యము నిశ్చయముగా నాగొడ్లకెందొంతి యల్లారెడ్డికైన నొనగూడదయ్యె. నలుప్రక్కల దివ్వెను ద్రిప్పి తనగొడ్లెల్ల నెల్లగ బరిక్షించి యెంచి మరలిపోజూచునంత నల్లారెడ్డి కాపాలలో

నొక మూలనొక తళతళమను మెఱుపు కానవచ్చెను. అయ్యా! ఏమో మాతమని యాతడు లివదివ్వెను సమీపమునకు చేర నందొక పసరుతో నిండిన కుండయును దానిని తాకుచు నేలబడియున్న యొకయినుపనాగలియును గానిపించెను. పసరుకుండను దాకియున్న యీ నాగటి చివరయే బంగారమై తళతళ మెరియుచుండెను. దానింగాంచి యచ్చెరువొంది యల్లారెడ్డికొంత వరకు నిశ్చేష్టుడై నిలువంబడి పదపడి సమీపమునందున్న యొక యినుపకడ్డీందీసి యాభాండమునందు ముంచెను. వెంటనే యాపసరుమహిమచేత నాకడ్డీయెల్ల బంగారుగా మారెను. అదిచూచి రెడ్డియత్యంత సంతోషముతో నాభాండమును దవళయావగృహమున భద్రపఱిచి తనసేవకులను బిలిపించి యాపసుపుల శాకయందలి జంతువుల నెల్ల బయట దరిమించి దానిని బసురామప్రీతిగావించెను.

(సశేషము)

# కోకిల

[బాలకవి తుర్లపాటి గోవర్ధనరావుగారు]

ఉ. ఆకువుఁ జెప్పనేర్తునని
యారచసామృతధారఁజూపి, నీ
వీశ్రమకోర్చినిల్వబడి
తే భగరాజ్ఞి! త్వదీయగాన వి
ద్యా శ్రవణంబొనర్చు లోలు
తకా లవమాత్రపుభీతిలేక యా
పై శుభగాత్ర మాధురి సు
భాసని పించెద నమ్మ కోకిలా!

చ. కొలఁది దినాలక్రింద మన
ముం గల యందపుమావితోఁటలో
పలభవదీయ దర్శనపు
భాగ్యము కల్గెనుగా యటంచు నీ
పలుకల కంఠనాదన మ
నంబునఁ జ్ఞప్తికి దత్తువాకొ? యో
ప్రలుఁగుపడంతి! కొమఱచి
పోతినిగా యలనాఁటి చెల్మినిన్.

చ. భవవనదిన్మునింగి విప
పత్పిన్నకీఁ మాడుచు సంచరించు మా
నవుఁడెటొ నీసుఖాన్విత వి
వందిత జీవితముందలంచి యో
ర్వవలె నటంచు నీదుసెల
వా! యగుఁగాక యదెట్లు సంభవిం
చు శుభఁ భాగ్యవంతులను
జూచి కలంగుట ధర్మమేకదా!

ఉ. ఒంటరిగాఁ బ్రమోదకలి
తోన్మదచిత్తత, సుందరాటవీ
మాటపభూరు శాఖగపవ
మానపరీమళముం భుజించి నా
కంటె మఱొక్కజీవునిలఁ
గానము గానము వందనంగనీ
దంట తనంబు చూపెదె? ము
దంబు గరంబ నిళంబు సత్కృతి?

ఉ. కోకిలయెంతదానవె? సు
ఖా! యని పంతముమీఱనాశ్వదే
నాకటువంటి గానకల
నీనుభవంబు విధాత్ఫుఁడిచ్చె నం
చీ కలహంబు బూనితె? క
నీసము మూఁడుఱగంటలేనినీ
వీకతనంగనం బడుదు
వేకద నాకీక నేమికావలెన్!

ఉ. పూఁతలు పట్టిమామిడి క
పోతమ! మూరుల దోఁటలోన నీ
వేలిచ్చైన రమ్యరుచి
జెప్పగ మాసముదాఁటి నీకు సం
ప్రీతిని బండ్లమాధురిఁగ
విశ్వప్రసాంత్రను జూపుదమ్మ! నే
నాతురతంభ వాక్ప్రతిఁగ
నంగను లొగ్గుచు లేచి యుండెదన్,

# పూర్వ శాసనములు

## శక 1550

### పుత్ర్తె నారాయణరావు

బందరుజిల్లా యిలాకానువున్న స్థలం తాలూకా యిలాకానువున్న స్థలం పరగణాలో చేరిన మం॥ అకిరిపల్లెలో రాజా శోభనాద్రి అప్పారావుబహద్దరు జమీందారుగారు గారికోటలోవున్న రాగిశాసనం॥

శ్రీ శోభనాద్రీశా॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయాదియు శాలివాహన శకవర్షంబులు ౧౫౫౦అగు నేటి విభవనామసంవత్సర వైశాఖశు ౧౫సోమవారం శ్రీమద్భగవద్భాగవతకైంకర్యపరాయణులైన దేవులపల్లి అచ్యుతభాగవతులుంగారికి ఇందుపురేల నారాయణరావుమజుందారుగారు ఇచ్చిన ధర్మశాసనం।

కొండపల్లి శీమలోనున్న స్థలం విలాయతలోను అకిరిపల్లి గ్రామం శ్రీ లక్ష్మీనారాయణప్రతిగాను సర్వమాన్యంచేసి శ్రీశోభనాద్రీశ్వరుల మహోత్సవాలకున్నూ శ్రీవైష్ణవులకున్నూ బ్రాహ్మణాలకున్నూ అగ్రహారంగాను మీవశాన సమర్పణ స్తిమి గనుక అందులోను మోతరఫానల్లవచ్చిన ఫలం శ్రీశోభనాద్రీశ్వరుల మహోత్సవాలకున్ను గ్రామపాలి మంతాను శ్రీ వైష్ణవులకు పగమున్ను। స్వర్ణపూలకు సభమున్ను। కట్టడిచేస్తిమిగనుక యీచొప్పున ఆచంద్రార్కంగాను మీపుత్రపౌత్రపారంపర్యం ఈప్రకారాన నడిపిస్తున్ను సుఖానవుండవలెను॥ ఏకైవభగినీలోకే। సర్వేషామేవభూభుజాం। నభోజ్యాన కరగ్రాహ్యా। విప్రదత్తావసుంధరా॥

స్వదత్తాంపరదత్తాంవా। యోహరేతివసుంధరాం।
షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాంజాయతేక్రిమిః॥

---

## శ 1550

### లచ్చిరాజుగారు

బందరుజిల్లాయిలాకానున్న స్థళంతాలూకా లోచేసిన నున్న స్థళం పరగణాలో చేరిన మం॥ అకిరిపల్లెలో రాజా శోభనాద్రి అప్పారావుబహద్దరు జమీందారుగారి కోటలోవున్న రాగిశాసనము—

నారాయణరాజుచేసిన విన్నపం॥

శ్రీశోభనాద్రీశా॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయాదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౫౦అగు నేటి విభవనామసంవత్సర వైశాఖశు ౧౫సోమవారం శ్రీమద్భగవద్భాగవత కైంకర్యపరాయణులైన దేవులపల్లి అచ్యుతభాగవతులంగారికి నందమూరి శముకు। లచ్చిరాజుగారు యిచ్చిన ధర్మశాసనం॥

కొండపల్లి శీమలోనున్న స్థలం యిలాయతీలోను అకిరిపల్లిగ్రామం శ్రీలక్ష్మీనారాయణప్రీతిగాను సర్వమాన్యముచేశి శ్రీశోభనాద్రీశులనున్ను। శ్రీవైష్ణవులకున్ను। బ్రాహ్మణులకున్ను అగ్రహారంగాను రాజశ్రీ ఇందుపురేల నారాయణరావుమజుందారుగారు రాగి ధర్మశాసనం వ్రాయించియిచ్చిన పద్ధతి మీపుత్రపౌత్రపారంపర్యం నడిపించగలవారము. అకిరిపల్లి తోటపల్లి యీరెండు గ్రామాదుల కరణాలు ఖిలం అయిపోయి వుండగాను ఆకరిణీకములు మమ్మున అంటివుండె కనుక శ్రీశోభనాద్రీశ్వర ప్రతిగాను కృష్ణార్పణముగాను ఈరెండుగ్రామాదుల కరిణీకం మీకు ధారాదత్తంచేసి యిస్తిమి గనుక మీపుత్రపౌత్రపారంపర్యము ఆచంద్రార్కముగాను అనుభవించవలెను॥ శ్లో॥ ఏకైవభగినీ లోకే। సర్వేషామేవభూభుజాం।

నభోజ్యావకరగ్రాంహ్యా। విప్రదత్తా వసుంధరా॥
స్వదత్తాం పరదత్తాం వా। యోహరేతివసుంధరా,
షష్టివర్షసహస్రాణి। విష్టాయాంజాయతేక్రిమిః॥

---

## శ 1648

### మునగాల రమణప్ప

బందరుజిల్లా యిలాకా బెజవాడ తాలూకా కొండపల్లి పరగణాలో చేరిన మం॥ కవులూరు గ్రామానకు పడమర చెరువుకట్టమీద అక్కడేవతుల్లు స్త్రంభాలుఅని పాతివున్న ఉత్తరపుస్తంభంమీద శాసనపు పలక॥

స్వస్తిశ్రీ శాలివాహనశకవర్షంబులు ౧౨౮౮ అగు నేటి పరాభవనామసంవత్సర మార్గశిర శు ౧౫ ఆదివారం మునగాల గర్వ్వశెట్టి కొమాంశు శేషాద్రి దేవుండున్ను తమ అన్నలు వెంకటపతి రంగశాయి కిన్ని కృష్ణలావనివద్ద వేయించిన ధర్మసత్రాలోను దయోత్తించిన అక్క-దేవాదులు స్తంభాలు॥ శ్రీ శ్రీం జేయంను.

---

## ప్రతాప పురుషోత్తములు

బందరుజిల్లా యిలాకా బెజవాడతాలూకా కొండపల్లి పరగణాలో చేరిన మం॥ కవులూరు గ్రామానకు పడమర కవులూరికి కొండపల్లికిన్ని మధ్యవున్న పొలి మేరమీద అనగా కొండపల్లిరస్తాకు వుత్తరంగా పడవేశివున్న నల్లరాయిమీది శాసనము—

## చంద్రుడు—సూర్యుడు

## శ్రీజగన్నాథం

వీర శ్రీజగపతి గౌడేశ్వర నవగౌడ కర్ణాటకుల బర్గేశ్వర ప్రతాప శ్రీ పురుషోత్తమ దేవులయ్యె పరరాయబు భయంకర విజయ రాజ్యముతోను మహాపాత్రజేనమహాపాత్రులు అధికారాన పట్నానకు కట్టిన పొలం కవులూరిపొలంలోను యీలప్రోలుపొలంలోను అకలము కుంటచాయనుండి అమ్మిశెట్టి చర్యావుత్తరం శిరంపోతమాలదిన్ని తూర్పు గారితివాడు యీసంగ్యాను యీశీమ యిదిఅవహువిప్పివాను గంగవద్ద గో బ్రాహ్మణహత్యచేశిన పాపమున పోవువారు॥

---

## అలాసత్తైన

బందరుజిల్లా యిలాకా బెజవాడ తాలూకా కొండపల్లి పరగణాలో చేరిన మం॥ కవులూరు గ్రామానకు పడమర అవులవారి ఇంటిలోపలవున్న నల్ల నాపరాయిమీదిశాసనం॥

## సూర్యుడు—చంద్రుడు

పరాభవనామసంవత్సర కార్తీక బ ౧౫ గురువారంనాడు చర్యప్రతిష్ఠ అలా సత్తైన తనతండ్రి తుంగదుంగమన్న తల్లి గంగమన్నా పుణ్యముగాను చర్య ప్రతిష్ఠ చేశెను॥

---

## శ 1305

## పోతినాయుడు

బందరుజిల్లా యిలాకా బెజవాడతాలూకా కొండపల్లి పరగణాలో చేరిన మం॥ కవులూరుగ్రామానకు ఉత్తరంగా బొత్తరాడిచెట్టు అనుకుని నిల్వవేశివున్న రాయి మీదిశాసనం॥

## చక్రంవున్నది—శంఖువున్నది

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౦౫ అగు నేటి విభవసంవత్సర పుష్యబ౧౪ ఆదివారంనాడు కవులూరి చెన్నమల్లానికి యీలమల్ల పోతము పోతి నాయుడు తమ తండ్రి అవమలనాయిని తమతల్లి తూరనసానికిం పుణ్యముగాను ఫలవృక్షములు సహింతమున్ను చింతలతోట సమర్పించెను॥ మంగళమహా॥ శ్రీం శ్రీం జేయంను॥

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం । పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ । స్వదత్తం నిష్ఫలంభవేత్॥

---

## శకం—(లేదు)

## పురుషోత్తమదేవుడు

బందరుజిల్లాయిలాకా బెజవాడతాలూకా కొండపల్లి పరగణాలో చేరిన మ॥ కవులూరుగ్రామానకు వుత్తరం వయిరుతిమూలగా పొలిమేరమీద నిల్వవేశివున్న రాయిమీదిశాసనం॥

## సూర్యుడు—చంద్రుడు—ఏనుగ

వీరశ్రీజగపతిగౌడేశ్వర నవగౌడ కర్ణాటకుల బర్గేశ్వర ప్రతాప శ్రీపురుషోత్తమ దేవులయ్యె పరరా

జభయాంకగ విజయరాజ్యమూలకులయ్యి పాల్లుక అను ఖదాన శ్రీరాజరాజ జగన్నాథప్రసాదక దండదజ్యసం దశాది పరిక్ష సంగ్రామమాగ రాజాది మాహాత్మ్యలు అటకాదాన కొండపల్లి పుర్గ్నానకు శిల్పనహాలంమూల కంభివార నూతనసుండి ఆకెంధ్రముకు తెనకనవాంతరం తనుత్తిల్దండ్యులకు పుణ్యముగాను ఈపాలిమేర పుత్తరము న——ఇక్కడనుంచి అక్షరములు అరిగిపోయినవి............

---

## శ 1079

### ప్రోలమదేవి

బందరుజిల్లాయిలాకా బెజవాడతాలూకాలో చేరిన మం॥ నశీపోయిరం చేదిగాకు ఫకీరు తక్యా అని పేర్గల గుట్టమీద పడివున్న రాతిమీద శాసనం॥

స్వర్గాపాయదుర్గ పనిమల్లి సాన్యా
ప్రాసాదపేట్యాక నిజధర్మకీర్త్యా
ప్రోలాంబికా దీపకరంద్వితియ్యాం।
శ్రీధాన్యవాట్యాపతయశివాయ॥

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౯ అగు నేటి ఈశ్వర సం॥ రమున విషువ సంక్రాంతినాడు శ్రీమండలేశ్వర మహాదేవగారు శ్రీమన్మహామండలేశ్వర పోతురాజుల కూతురు ప్రోలమదేవులు వన పురుషులందు దుర్గరాజవరు ధర్మార్థముగాను వక దీపమునకు గానపోల కొమ్మనపోయిన వరిమున నొక దీపమునకు పెట్టిన గొర్యలు దివ్యెయ్యేను రెండు గదుపుల తగుష్పు రెండు వీనిం జేగాని వీగ లిప్సను గాంపులంబు ప్రాను పాత్రికము ఆచంద్రార్కమున మాకెంతు సేసి నెయ్యిగొని నిత్య అడ్డెండు నెయ్యివోసి దీపము నడుపంగలవారు॥

---

## శ 1550

### ఖండేరాయలు

బందరుజిల్లాయిలాకా కయికలూరుతాలూకా చిత్తకుర్రుపల్లి పరగణాలో చేరిన క॥ కయికలూరులో గ్రామానకు పడమరవముపున వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయములో గర్భాలయమునకు యెదురుగావున్న శ్రీఆంజనేయుల గుడిని దక్షిణ భాగమందట పాతివున్న వల్లరాతి మీద శాసనం

### శ్రీ వేంకటాపతి॥

రాజావిజయాభవ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౫౦ అగు నేటి వర్తమాన విభవసంవత్సర జ్యేష్ఠ శు ౫ శుక్రవారమును ఈశుభ దినమందు శ్రీమదాత్రేయ గోత్రాశ్వ లింగోత్ర మంత్రిశేఖరః। సర్వాశాసాకాజి సత్పాత్రో। గోపుజీవరానందనః॥ భండారయార్ధిక సంభూతిః శాస్త్రశాఖాప్రవర్తకః। విష్ణుభక్తిరతిః శ్రీమాన్ మహాన్ ధార్మిక మతో త్తమః। కూనెల్లివంశ శ్రేష్ఠో రామాజీ పండితాగ్రజః। లక్ష్మమాంబా మనోహరః। ఖండేరాయ ప్రతాపవాన్॥

### పద్యాలు

ధరణి బొగడొందు యేలూరి దండపాటి
కింది భిత్తరుష్పల్లిలో నందమైన
కైకలూరను పేరి కయింతపురిని
శాశ్వతంబుగ శ్రీవెంకటేశ్వరులనా॥ ౧
రాఘవేశ్వరు నాళ్వారి రామలింగ
మాంజనేయులనిల్పి దేవాలయములు
మట్టుపట్లను గోపురమంటపప్రా
కారములు తేలగా గట్టించి వేరువేరా॥ ౨
తిరుప్రతిష్ఠచేశి తిరునాళ్ళ సాగించి
యవసరములు బడితరాదినిత్య
వారపక్ష మాసవత్సరోత్సవానేక
వైభవములు బ్రాహ్మవైభవములు॥ 3
ఏవేట సాగునట్లుగ
హీటికి బలిపట్లుకడి ప్రతిష్ఠలుబడిలో
ల్లేటిదరి గైంకలూరును
వాటికి మున్యాదురుబంటు వరువలకు పొల మగ్గిర

స్థానమై జియ్యాళ్వారిని
స్తానము సమయంబువారస్తానము వారికా
స్తానాచార్యుల శ్రీవై
ఖానసులనునిల్పె స్వామికైంకర్యార్థమై౯

ఈమాన్యాలకెల్ల గృహా
రామక్షేత్రంబు లేపరచి తగనిల్పెన్
నామనముద్రలు వెలయం
గామాన్య క్షేత్రములకు గరకంభాదుల్ ౬

స్వామికెప్పుడు రాజోపచారములకు
నుంచెనధికార్లపౌరాణి స్తోత్రములను
కాల జోశ్యుల యోగ్యులం గాయకులను
వందిజనములుగా నిలవాద్యకాండ్ర ౭

వీరికిందరికిని వృత్తులు నిక్కైక
లూర మాఖగుమారము నార్జితముగ
సాగునట్లుగాను శాసనంబులునిల్పె
ప్రీతిమంతులకును వేరువేర ౮

ఎవ్వరైననేమి యిందులకును విఘ్న
మాచరించతలచినంతలోనె
కాశిలోన మాతృగమనంబు చేసిన
వారిగతికి బోవువారు ౯

వెంకటమల్లిరి రాయని
కంకితముగ జేయుచెప్పియర్పించెమహా
సంకీర్తనములు వాచా
కైంకర్యము సంఘటించెగవణదభూపా ౧౦

శ్రీవీరరాఘవేశ్వరు
శ్రీవేంకటపతి ప్రతిష్టచేసినిలింపుల్
సేవించదివ్యతిరపతిః
గావించెన్ గైకలూరుకుండెరాయుడు ౧౧

శ్రీం శ్రీం జేయును

## వృత్తులు ఏర్పాటు

| | |
|---|---|
| శ్రీ వెంకటేశ్వరులకు | క ౨౮౦ |
| శ్రీ వీరరాఘవేశ్వరులకు | క ౧౪౦ |
| శ్రీ హనుమానులకు | క ౧౪౦ |
| శ్రీ రామలింగానకు | క ౧౪౦ |
| స్తానాచార్యులకు | క ౧౮౦ |
| స్తానంవారికి | క ౧౪౦ |
| సమయంవారికి | క ౧౮౦ |
| పౌరాణీకులకు | క ౧౪౦ |
| కవీశ్వరులకు | క ౨౫౦ |
| జోశ్యులకు | క ౧౮౦ |
| యోగ్యులకు | క ౦౪౦ |
| పాఠకులకు | క ౦౮౦ |
| భట్లకున్ను | క ౦౫౦ |
| కాళలకు | క ౦౪౦ |
| సన్నాయి భజంత్రీలకు | క ౧౫౦ |
| కుడిపాత్రలకు తాళగోడికి మద్దెలవానికిన్ని | క ౩౮౦ |
| కూడా వెరశి వృత్తులు | ౨౫ |

అక్షరాలాను ఇరువైఅయిదువృత్తులు

## శ్రీ శ్లోకాలు

స్వదత్తాద్విగుణంపుణ్యం
పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ
స్వదత్తం నిష్ఫలంభవేత్ ౧

స్వదత్తం పరదత్తంవా
యోహరేతివసుంధరా
షష్టివర్షసహస్రాణి
విష్టాయాంజాయతే క్రిమిః ౨

దానపాలనయోర్మధ్యే
దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గమవాప్నోతి
పాలనాదచ్యుతం పదం ౩

# చంద్రగుప్తుడు శూద్రుడా?

[శ్రీ పాద కామేశ్వరరావుగారు యమ్. ఏ. యల్. టి.]

సార్వభౌముడగు చంద్రగుప్తమౌర్యుడు మహాపద్మనందమహారాజునకు దాసియగు మురకును జనించినవాడనియు కావున శూద్రుడనియు, అతడు స్థాపించిన రాజవంశ మాతని తల్లిపేర బరగుటచే మౌర్యవంశమయ్యెననియు నొకప్రతీతి చాలకాలము నుండి ప్రబలమైయున్నది. ఇది యితిహాసములయందు ప్రచురమైయున్నను చంద్రగుప్తుడు క్షత్రియుడను శంకకాతవాడమివది, కావున దానిగూర్చి కొంతచర్చకు గడంగెదను.

చంద్రగుప్తుడు శూద్రుడనుటకు ప్రమాణమేది? పురాణములయందు నందునితో క్షత్రియవంశము నాశిపిదప "శూద్రామహీపాలాభవిష్యంతి" అని వ్రాయబడుటచే నందుల నంతరింపజేసి మగధరాజ్యసింహాసన మధిష్ఠించిన చంద్రగుప్తుడు శూద్రుడనియే భావనకలిగెను.

రెండవది విశాఖదత్తుడు రచించిన "ముద్రారాక్షస" నాటకమందు చాణక్యుడు చంద్రగుప్తుని "వృషలా" అని సంబోధించును. వృషలులన శూద్రులని భావించి లోకులు చంద్రగుప్తుడు శూద్రుడని నిర్ధారణజేసిరి.

ఇవి రెండును ప్రబలప్రమాణములు కావు. వీనినాధారముగాజేసి చంద్రగుప్తునికి శూద్రత్వము సాధించుట ఐతిహాసిక న్యాయసమ్మతము కాదు. శౌర్యవాదియగు చంద్రగుప్తుడు మగధరాజ్యస్థితిగమనించి సింహాసనముపై కన్నువేసి శూద్రుడని ప్రచ్ఛన్నవృత్తి నాతనికొల్పసమ్మతించి యుండును. ఇందు మూలమున నీవృత్తాంతము పురాణములలోని కెక్కియుండును. అట్లుకాకయున్న మహాపండితుడు రాజనీతిజ్ఞుడు, అశేషలోకజ్ఞాన సమన్వితుడు ప్రతిభాశాలియునగు విష్ణుగుప్తుడు (చాణక్యుడు) శూద్రుడును దాసీపుత్రుడునగు నాతని సార్వభౌమునిచేయునా? నందవంశము నిర్మూలించి చంద్రగుప్తునికి పట్టాభిషేక మొనర్చుటకు కలయు సామగ్రిచేకూర్చిన మహానుభావుడు ద్విజేతరునకై యింత పాటుపడునా! అర్థశాస్త్రమున జూడుడు

"యేనశాస్త్రంచ శస్త్రంచ నందరాజగతా చభూః
అమర్షేణోద్ధృతాన్యాశు తేన శాస్త్రమిదం కృతమ్"

కావున చంద్రగుప్తుడు క్షత్రియుడైన కావలయు, లేదా రాజ్యార్హతకు ప్రతికూలమగు పుట్టుపూర్వోత్తరము లాయన యందు లేకయుండవలయును.

ఇక వృషలుడన్న శూద్రుడని యందుమా?

వృషలుడను శబ్దము మొట్టమొదట ఋగ్వేదమున పదియవ మండలమున 39వ సూక్తము 11వ మంత్రమునయున్నది. అచ్చోట దానియర్థము "బహిష్కృతుడు," "పతితుడు" అనియగును కాని శూద్రుడనికానేరదు.

పిమ్మట మహాభారతమున శాంతిపర్వమున నీ శబ్దమునకు "ధర్మలోపి" అని యున్నది.

మానవధర్మశాస్త్రమున పౌండ్రకులు, ద్రవిడులు, చీనులు మొదలగు జాతులవారిని గూర్చి ప్రసంగించుచు,

"శనకైస్తుక్రియాలోపాదిమాః క్షత్రియజాతయః
వృషలత్వం గతా ఏతాః బ్రాహ్మణాదర్శనేనచ"

అని చెప్పబడియె. అనగా కొన్ని "క్షత్రియజాతులు కర్మలోపమునను, బ్రాహ్మణదర్శనము లేకుండుటచేతను వృషలత్వమును పొందినవ"ని యున్నది. ఇందుచే వారికి శూద్రత్వమాపాదించుట యెట్లు?

హీనకర్మలజేయు బ్రాహ్మణులు వృషలులని బౌద్ధులలో నొక వాడుకయుండెను. పాతిత్యమున మొదటితరగతివారు "వ్రాత్య" లనియు, రెండవతరగతివారువృషలులనియు ఎన్నబడుచుండిరి. మనుస్మృతియందు పదియవ అధ్యాయమున 22వ శ్లోకమున "క్షత్రియజాతికి వ్రాత్యులసంపర్కముచే ఝల్లులు, మల్లులు, లిచ్ఛవీలు, నటులు, కరణులు, ఖసులు, ద్రావిడులు జనించిరి" అనియున్నది.

అందే 20వ శ్లోకమున "ద్విజులకు సజాతీయస్త్రీయందుత్పన్నులై ధర్మకర్మాచరణమును వీడి

సావిత్రీమంత్రోపదేశమున కనర్హులగువారు వ్రాత్యుల”ని యున్నది.

మఱియు శ్రీకృష్ణుని శత్రువులాతని వ్రాత్యుడని నిందింతురు. దీనిబట్టి క్రియాహీనులగు ద్విజుల యెడను “వ్రాత్య,” వృషల శబ్దములు వాడబడుచుండెనని తెలియుచున్నది. కావున వృషలుడన్న మాత్రమున చంద్రగుప్తుడు శూద్రుడు కాడు.

చంద్రగుప్తునందలి క్షాత్త్రతేజస్సెట్టిదో చూతము. అతడు తక్షశిలావిశ్వవిద్యాలయమున విద్యనభ్యసించి యవనుల జేతికి లొంగిపడి విదేశములయందుండెను. విద్వాంసుడు, బుద్ధిమంతుడు, వీరుడు. పంజాబునుండి యవనుల నిర్జించి పాఱద్రోలెను. కాని వారే అతనితో సంధిగావించుకొనిరి. అసాధారణ రాజనీతిజ్ఞుడగు చాణక్యుడాతని మంత్రిగానుండుట కియ్యకొనెను.

జైనగ్రంథములయందు చంద్రగుప్తుడు క్షత్త్రియుడని యున్నది. ఇదిగాక “మహావంశ ము” ను బౌద్ధగ్రంథమున నిట్లున్నది. గౌతమ బుద్ధుని కాలమున కొందఱు శాక్యులు ఉత్పీడితులై హిమాలయ ప్రాంతమునకు బోయి “మోరియా (మౌర్య) నగర” మును నిర్మించుకొనిరి. అచ్చోటు మయూరముల కేకలచే నెల్లప్పుడును మ్రోగుచుండుటచే దానికా పేరు వచ్చెను. మోరయనది ‘మయూర’ శబ్దమునకు తద్భవము. ఉ. మోరమకుట్ బుద్ధదేవుడు అశోకుడు నొకవంశమువారని బౌద్ధుల యభిప్రాయము. అశోకుడు చంద్రగుప్తుని మనుమడు. ఈతడు మోరియానగరాధికుమారుడు.

మహావంశటీకయందు పిప్పలీవనమందలి మౌర్యుల వర్ణన మున్నది. దీఘనికాయమను గ్రంథమున వైశాలీనగరమందలి లిచ్ఛవీయులు, కపిలవస్తు నగరమందలి శాక్యులు, అల్లకప్పయందలి బులియులు, రామగ్రామమందలి కోలియులు; పిప్పలీవనమందలి మౌర్యులను, క్షత్త్రియసంఘములని చెప్పబడి యున్నది. పిప్పలీవనమందలి మౌర్యులకును గౌతమ బుద్ధుని భస్మము సంగ్రహబడియె. అందుచే వారు తప్పక క్షత్త్రియులే. పైనుదహరించిన క్షత్త్రియసంఘముల వారి కందఱకు బుద్ధదేవుని అస్థికలో భస్మము లభించియుండెను. ఇట్లగుటవారందఱు బౌద్ధులమాటకాదు- సజాతీయులగు వారందఱు కుశీనగరమున బుద్ధదేవుని తోడి క్షత్త్రియులము కావున స్మారకచిహ్నముల నొందమాకును హక్కుకలదని వాదించిరి.

కావున నీ నిదర్శనములబట్టి చంద్రగుప్తుడు శూద్రుడు కాడనియు క్షత్త్రియుడనియు తేలుచున్నది పురాతత్త్వాన్వేషిత లీవిషయమున కృషి చేయుదురు గాక.

అంబికాప్రసాదవాజపేయి

(“మాధురీ”. అను హిందీపత్రికనుండి యొత్తబడినది.)

---

# పారతంత్ర్యము

[మద్దికట్ల వేంకటరమణయ్యగారు]

కోవసీకుహారాంబుధి నీదువట్లు
పఱుపు రెక్కలసార్చి యంబరపువీథి
నెగురుచున్నట్టి యొక డేగ నగరిలోనం
దోడి పక్షినిగాంచి సంతోష మెసంగ
శ్రోణిమీదను దిగబడ్డ చుక్కరీతి
దిగువకుం డింపు వాకాశ [illegible]
లక్ష్యయానంబుచాలించి [illegible]
క్రిందికిం డిగ్గి యంతట నుందరముగ.
డంబు మీఱెడు వెదురుదండెంబుమీదం
బొటమరింప మీఁగడుపు క్రిం బొట్టవాని
కనుకనుచున్నట్టి పక్షి దాపునకుఁజేరి
“యనుఁగుసఖ! నీకుఁగుశలమా?” యను మనడిగ
అనుటకుఁ బకపక నవ్వి చెంగునవ్వు
“కుశలమేయుండు నహోనుదే గ్రుచ్చినన్నె?

నంటే సంస్కృతమున 'గేనపర్యేతి' యని పండితులు ప్రయోగింతురు. ద్రావిడభాషలలో నాటికలోనిట్టి ప్రయోగములు [వానిచేతఁ జదువఁబడుచున్నది] లేవుసరిగదా? కన్నడమునందు ద్రవిడమునందును ప్రాచీన గ్రంథములలోఁ గూడగానరావఁట. సంస్కృతపాణినులయిన మనపూర్వులు లాక్షణికులు పాణినీయపద్ధతిని ఆంధ్రవ్యాకరణము నిర్మించినవారనుటకు ¹ధాతువులకుఁ గర్త్రర్థంబునఁ బహుధాతువనుబంధములుగా నవ్యయని ప్రాయుటకును నొకయుదాహరణముగాఁ గలదు. ఇట్లే పరిశీలించినచో నామక్రియాదిశబ్దములు ధాతువులయిన జాడులయిన దానికిని దీనికిని భేదములు గనుగొనవచ్చును. ఇఁక వ్యాకరణప్రసంగము నిట్లుంచి వీనికిని దానికిని శబ్దజాలమునందు సామ్యమున్నదా లేదా యని కొన్ని ముఖ్యపదములనుదాహరించి చూపెదము.

| | తె | క | త | సంస్కృతము |
|---|---|---|---|---|
| | తల | తల | తలై | శిరః |
| | కన్ను | కణ్ణు | కణ్ | నేత్రం |
| | కై | కై | కై | కరః |
| | ముక్కు | మూక్ | మూక్కు | నాసికా |
| | పల్లు | పల్లు | పల్ | దంతః |
| | ఒడలు | ఒడలు | ఉడల్ | శరీరం |
| | తోలు | తొగల్ | తోల్ | చర్మ |
| | అప్ప (అయ్య) | అప్ప | అప్ప | పితా |
| (1) | అమ్మ | అమ్మ | అమ్మాళ్ | అంబా |
| | అన్న | అణ్ణ | అణ్ణన్ | భ్రాతా |
| | తమ్ముడు | తమ్మ | తంబి | అనుజః |
| | మామ | మామ | మామన్ | మాతులః |
| | అత్త | అత్తె | అత్తై | శ్వశ్రూః |
| | పేరు | పేర్ | పెయర్ | నామ |
| (2) | నీరు | నీర్ | నీర్ | నీరం |
| (3) | మన్ను | మణ్ణు | మణ్ | మృత్ |
| | నేల | నెల | నిలం | భూమిః |
| | ఊరు | ఊర్ | ఊర్ | గ్రామః |
| | పొలం | పొల | పులం | క్షేత్రం |
| | పులు | పుల్లు | పుల్లు | తృణం |
| | ఆవు | ఆవు | ఆ | గౌః |
| | పాలు | పాల్ | పాల్ | పయః |
| | నెయ్యి | నెయ్ | నేయ్ | ఘృతం |
| | మల | మల | మలై | పర్వతః |
| | పులి | పులి | పులి | పుండరీకః |
| | విల్లు | బిల్లు | విల్ | ధనుః |
| (4) | పూవు | పూ | పూ | పుష్పం |
| (5) | కాకి | కాగి, కాగె | కాక్కాయి, కాక్కై | కాకః |
| (6) | కోడి | కోళి | కోళి | కుక్కుటః |

1 కర్మణ్యనుబంధసాన్నిధ్యాత్ పతిధాతుః కర్తృవన్మతి ద్వ్యర్థయః. ఆం.

1, 2, 3, 4, 5, 6 తద్భవములుగా మనవారు పరిగణించిన యీయాటిని మూలద్రవిడమునుండి వచ్చినవని తెలుపుటకే యిందుదాహరింపబడినవి. ఇట్టివి పెక్కు గలవు.

| | | | |
|---|---|---|---|
| ఒండు | ఒక్కు | [illegible] | ఏకః |
| మూఱు | [illegible] | [illegible] | త్రీణి |

ఇట్లే నిఘంటువులను జక్కఁగాఁ బరిశీలించినచో సంఖ్యావాచక శబ్దములన్నియును గృహములందును వివిధవృత్తులయందును వాడఁబడు మాటలును జంతువులను జడపదార్థములను దెల్పుపదములును ధాతువులును మనయీ మూఁడుభాషలయందును గాటింపరాని భేదములతో సమానముగానున్నవి యేడెనిమిదివందలుండునని తోఁచుచున్నది. ద్రావిడభాషలలో బహుపదములకు సామ్యముగలదనెడి యీ యభిప్రాయమున, కాల్డువెల్లుపండితుఁడును మలయాళనిఘంటువును బ్రకటించిన గుండర్టుపండితుఁడును, కన్నడనిఘంటువును సమకూర్చిన కిట్టెలుపండితుఁడు గూడ నేకీభవించియున్నారు. ఇంకను మూఁడుభాషలును జక్కఁగాఁ దెలిసిన మనపండితులు వీనిలోసమానపదములను విడఁదీయ మొదలిడినచో స్థూలదృష్టితోఁ జెప్పిన పైసంఖ్యకంటె వీనిలోని తుల్యపదములసంఖ్య యధికమే యగును గాని తక్కువగాదు. మరి యుదీచ్యద్రావిడభాషనుండి వీనిలోనికి వచ్చినశబ్దజాలములో నిసుమంతయుఁ బోలికలేకుండఁగా మాఱిపోయిన శబ్దము లెన్నివేలుండునో యూహింపఁదగినదియే కాని చెప్పఁదగినది గాదు. కావునఁ బైపట్టికలోఁజూపిన యీమూఁడుభాషలలోని సమానపదములు వానిప్రక్కనున్న సంస్కృతపదముల నంటక యెట్లు స్వతంత్రముగాఁ గానవచ్చుచున్నవో యట్లే వందలకొలఁది పదములున్నవనుట యాశ్చర్యకరము గాదు. కాని యీసందర్భమునఁ గొందఱు తద్భవములని తలంచెడి యీమూఁడింటిలోని కొన్ని పదములను గూర్చి యించుక చర్చింపవలసియున్నది.

ఒకవేళ నేకవస్తుత్రయము బోధించు పద మొక్కటిట్లే యుండిన యుండెనేని యొప్పును గాని. వారువిద్యలంగనుచున్న వానికిఁ బేర్లే లేవనుట యసంగతము. పైపట్టికలోని " పూవు, కాకి, కోడి ", యను నవి [illegible] పుష్పము, కాకము, కుక్కుటము అను సంస్కృతపదములనుండఁ బుట్టినవని మన తద్భవ నిర్ణాయకుల మతము.

ఆవస్తువులను జెప్పునప్పుడు మన [illegible] వారేకాక ద్రవిడకర్ణాట దేశముల వారు గూడ బాలగోపాల మెల్లను నీపదములనే వాడుట యనాదిగా వచ్చునది గాని నేఁటిది గాదు. వీనికిఁ బర్యాయ పదములు గూడ సుప్రసిద్ధములయినవి లేవనుట సాహసము గాదు. సుప్రసిద్ధములనేల? మాఱుమాటలు లేవనియే చెప్పవచ్చును. అట్టిమీఁద వీనిని గూడ ( ఇట్టివనేకములు గలవు ) తద్భవములలోఁ జేర్చినచో నిప్పుడు కాసలమును దల్లియయిన మూలద్రవిడ భాషను మాటలాడు తొల్లింటి ద్రవిడులు, మన యార్యులు తమతోఁ బుష్పమును కాకములను, కుక్కుటములను దెచ్చి వారికిఁ జూపి వాని పేర్లు చెప్పునందాక ' పూవు, కాకి, కోడి ' లేకుండఁగా నేయున్నారని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పుట సాహసము గాదా? ' కాకా ' యని కూయు పక్షికి, కాకి లేక కాక్కాయి యనియు, కొక్కో యని కూయు పక్షికి, కోడి లేక కోళి యనియుఁ బేర్లు పెట్టుకొనకుండుటకు వారు మాత్రము నోరు వాయిలేనివారా? సంస్కృతమున మాత్రము వీనికింతకంటెఁ గనబడు గొప్ప వ్యుత్పత్తులేమున్నవి? మఱియుఁ బూవుశబ్దము తద్భవమనుటకై పూచుధాతువు పుష్పించు ధాతువు నుండి పుట్టిన దనెడి భ్రాంతి మన నిఘంటువులకుఁ గలిగినది గాని యీపూశబ్దము తమిళకన్నడములలో శుద్ధదేశ్యముగానే యున్నది. ఒకటి మాదితిరా? కాచుధాతువు దేశ్యమఁట! 'పూచు' తద్భవమఁట! సంస్కృతప్రాకృతము లిక్కడకు రాకమున్ను చెట్లు పూచి కాచెడివో లేదో! [illegible]